# వేమన - తాత్త్వికత

యలవర్తి భానుభవాని



ప్రకాశకులు

**రామానంద ట్రస్ట్**

**శ్రీ లలితానందాశ్రమము,**

వాడరేవు, చీరాల.

**వేమన - తాత్త్వికత**

**యలవర్తి భానుభవాని**

ముద్రణ : ***18-06-2016***

ప్రతులు : ***1500***

పేజీలు : ***100***

వెల రూ. : అమూల్యం


**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
Cell : 9440115411

***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**

# మనసులోమాట

వేమన యోగిగా, ప్రజాకవిగా, సంస్కరణవాదిగా మూఢాచారవిమర్శకుడుగా, కులమతాలకు అతీతంగా జ్ఞానానికి పెద్దపీటవేసిన సహృదయుడుగా వేమన శతకం చదివిన ప్రతి ఒక్కరికీ తెలుసు. అనేక నీతులను నిశితంగా సరళంగా ఉన్న శైలిలో వ్రాసిన కారణంగా ప్రాథమిక విద్యాస్థాయినుండి పాఠ్యాంశాలలో వేమన పద్యాలు, ఇతర నీతి పద్యాలు చేర్చడం ఆనవాయితీగా వస్తున్న విషయమే. ప్రాథమికస్థాయిలో పరోక్షప్రభావాన్ని బీజప్రాయంగా విద్యార్థులలో నాటగల శక్తి ఈ శతకసాహిత్యానికి ఉన్నది. కాని ఆ తరువాత స్థాయిలో విశ్లేషణాత్మకంగా, విమర్శనాత్మకంగా పఠించినప్పుడే వ్యక్తిత్వాన్ని, ఆలోచనావిధానాన్ని తీర్చిదిద్దే అవకాశం కలుగుతుంది. ఈ దృష్టిలో విద్యార్థులకు బోధించే అవకాశం, పెద్దలకు ఆలోచించే అవకాశం లభిస్తే బాగుంటుంది.

ప్రస్తుతవిషయానికి వస్తే తలవని తలంపుగా రావిమోహనరావుగారి పరిచయం, వారు ఆత్మజ్యోతి మాస పత్రికకు వ్యాసాలు వ్రాయాలని కోరడం జరిగింది. స్వామి రామానంద సరస్వతి వారి సూచన మేరకు వేమన గురించి వ్రాయాలన్న నిర్ణయం జరిగింది. నిజానికి వేమనవిగా దాదాపు 5వేల పద్యాలు లభిస్తున్నాయి. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి దగ్గరనుండి నేటిదాక ఎంతోమంది వేమన గురించి విశ్లేషణాత్మకంగాను, పరిశోధనాత్మకంగాను రచనలు చేశారు. అనేక కోణాలలో ఆ రచనలు సాగినవి. నేను ఏ ఇతర రచనలు ప్రస్తుతం చదవకుండా కేవలం నా సొంత అభిప్రాయాలతో మాత్రమే కొన్ని పద్యాలను వ్యాఖ్యానించాలని, వ్యాసాలు వ్రాయాలని నిర్ణయించు కున్నాను. అందువలన ఎవరి భావాలను ఉదహరించడం లాంటి సందర్భాలు రాలేదు. ఆధ్యాత్మిక, సామాజిక కోణాలలో వేమనను, వేమన ఆలోచనలను విశ్లేషించాలని చిన్న ప్రయత్నం చేశాను. ఇతర రచయితల అభిప్రాయాలు నా అభిప్రాయాలు కొన్నిచోట్ల ఒకేరకంగా ఉండి ఉండవచ్చు. కారణం అది వేమనను చూపే ప్రయత్నంలో ఉన్న భావసారూప్యత కావచ్చు. మొత్తంమీద ఈ వ్యాసాలన్నీ నా సొంత ఆలోచనలు అభిప్రాయాలు మాత్రమే. ఇందులోని గుణదోషాలను సహృదయులు మన్నించి తెలియ చేయగలరు.

ఈ రచనావ్యాసంగంలో స్వామీజీ విషయసూచన, మోహనరావుగారి నిర్దేశం ప్రత్యక్ష ప్రేరణలు – మా నాన్నగారు నవంబరు 26వ తేదీన 2005వ సం॥లో నాకు చెప్పిన చివరి మాటలు పరోక్ష ప్రేరణ. “నీ విద్యార్థులకు శతకాలు బోధించు – ఎలా

బ్రతకాలో నేర్చుకుంటారు" అనేవి ఆ మాటలు. ఆ మాటల ప్రభావం నా మనసులో సదా మెదులుతూనే ఉండటం, అనుకోని విధంగా ఈ అవకాశం కల్గడం నా అదృష్టం. నేను వ్రాసిన ఈ కొద్ది వ్యాసాలలో వేమన అనుభవాన్ని, పరిశీలనను, ఆధ్యాత్మిక విధానాన్ని, సామాజిక దృక్పథాన్ని పాఠకులకిచ్చిన సందేశాన్ని, ప్రస్తుత సమాజాన్ని పట్టి పీడిస్తున్న రుగ్మతలు రూపుమాపటంలో ఆ సందేశపు అవసరాన్ని స్థాలీపులాక న్యాయంగా స్పృశించడమైనది. ఈ వ్యాసాలు ఒక సంపుటిగా పుస్తకరూపంలోకి వస్తున్న విషయం నాకు అపరిమిత ఆనందాన్ని కల్గించింది. నా ప్రయత్నం ఫలించి పఠనాసక్తి గలవారు దీన్ని చదివితే ఆ సంతోషానికి సార్థకత లభిస్తుందని భావిస్తున్నాను.

ఈ చిన్ని వ్యాస సంపుటిని పుస్తకరూపంలోకి తెచ్చి శాశ్వతత్వాన్ని కల్పించి, పదిమందికి పరిచయం చేస్తున్న రామానంద ట్రస్ట్ వారికి, ఈ ప్రయత్నానికి సారథులైన మోహనరావుగారికి కృతజ్ఞతాపూర్వకధన్యవాదములు. పరోక్షంగా పద్యసేకరణలోను, ఇతరత్రా నాకు సహకరించిన శ్రేయోభిలాషులకు కృతజ్ఞతాభివందనములు.

గుంటూరు. **యలవర్తి భానుభవాని,** పిహెచ్.డి.,
ది. 07-03-2016 విశ్రాంత అధ్యాపకులు

# విషయసూచిక

# I

## వేమనశతకము - యోగరహస్యము.1

**ఆశ కోసి వేసి యనలంబు చల్లార్చి**
**గోచి బిగియగట్టి గుట్టుదెలిసి**
**నిలిచినట్టివాడె నెఱయోగి యెందైన!**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

యోగి వేమన అనుపేరు తెలుగునాట సుపరిచితము. వేమన శతకము సర్వజన సమాదరణీయము. వేమన ఒక యోగి. అనగానేమి? యోగవిద్యలను ఆమూలగ్రముగా నెఱింగిన వాడా? యోగస్థితి యందు జీవించినవాడా? యోగమార్గముననుసరించి బోధించినవాడా? వేమన జీవితమును గూర్చి అనుశ్రుతముగా వచ్చిన విషయములను బట్టి 'అభిరాముడను' గురువు వద్ద ఆధ్యాత్మిక లేదా యోగ విద్యారహస్యములనెఱింగి, సర్వసుఖములను పరిత్యజించి, కోరికలను త్రుంచివేసి దేశాటనము చేయుచు కాలము గడిపినట్లు తెలియవచ్చుచున్నది. అంతేకాదు, భోగికాని వాడు యోగికాడు అను విషయమునకు ఆయన జీవితము ఉదాహరణ ప్రాయమని కూడ తెలియనగుచున్నది. ఈ వ్యాసము ఆయన జీవన మార్గములో, రచనలో ప్రతిబింబించిన ఆధ్యాత్మికతత్త్వమును పరిశీలించు ఉద్దేశముతో వ్రాయబడుచుండుట చేత, ఆయన జీవిత వృత్తాంతములు, చారిత్రక విషయముల జోలికి ఎక్కువగా పోనవసరము లేదు. అసలు యోగమనగానేమి? చిత్తవృత్తులను నిరోధించటమే యోగమా? దీని పరిధిని ఏరకముగా గుర్తించాలి? ఈ విషయాలను దృష్టిలో ఉంచుకొని ఆలోచించినప్పుడు తెలిసే అంశం ఏమంటే అంతశ్శత్రువులైన కామ క్రోధాది గుణాలను జయించి ఆత్మజ్ఞానాన్ని, తత్వాన్ని తెలుకునేందుకు ఏకాగ్రతతో చేసే ప్రయత్నమే యోగసాధన అని చెప్పవచ్చు. ఈ సాధనలో రకరకాల మార్గాలు శాస్త్రీయంగాను, గురుముఖంగానూ చెప్పబడి ఉన్నవి. స్వామి శ్రీకాంతానంద 'యోగమంటే నిశ్శబ్దం' అని చెప్పారు.

'Talking to god is Prayer, Talking to none is silence And silence is yoga' అనేది వారి నిర్వచనం.

వారే మరొక చోట ఈవిధంగా అన్నారు.

"Those who have control over their minds are masters, Those who are controlled by their minds are slaves."

ఈ masters అనగా గురువులు లేదా యజమానులే ఇక్కడ యోగులని భావించటం దోషం కాకపోవచ్చు. సామాన్యార్థంలో వివరించాలనుకుంటే యోగమంటే **ఆలోచన, ఆచరణ** ఒకే విధంగా ఉండటము అని చెప్పవచ్చును. ఇక్కడ ఆలోచన అనగా సదాలోచన మాత్రమే. మొత్తము మీద ఏకాగ్రత చిత్తశుద్ధితో కూడినప్పుడు యోగమౌతుందని, ఆ మార్గాన్ని అనుసరించి వివేకంతో ప్రవర్తించే వారంతా యోగుల (వంటివార)ని సామాజికార్థంలో చెప్పవచ్చును. ఈ రెండు మార్గాలలో (అనగా శాస్త్రీయ, సామాజిక) వేమన సాహిత్యము ఆధారంగా ఆయనను అంచనా వేసినప్పుడు ఆయన యోగమంతా నిత్యజీవితంలోని ఆచరణకు సంబంధించిన సరళ మార్గమని అభిప్రాయము ఏర్పడుచున్నది. దీనినే “Practical Yoga or Vedantha” అని అనవచ్చునేమో! వివేకానందుడు చెప్పిన “Theory is very good indeed, but how are we to carry it into practice?” అన్న మాటలకు సమాధానం వేమన పద్యాలలో సామాన్యులకు అందుబాటు లోనికి వచ్చుచున్నది. “Vedanta philosophy is not the out come of meditation in the forests only, but that the very best parts of it were thought out and expressed by brains which were busiest in the everyday affairs of life” అన్న వివేకానందుని ఆధ్యాత్మికవిద్యకు సంబంధించిన నిర్వచనానికి వేమన జీవితం, వేమన పద్యాలు, సందేశం చక్కటి నిదర్శనాలు.

ఎంతో దూరము లోతుగా వెళ్ళి ఆలోచించి అర్థము చేసికొనవలసిన అగత్యము లేకుండా వేమన సరళపదజాలముతో సరళాతిసరళముగా ‘యోగి’ అనే మాటను నిర్వచించినాడు. యోగికి ఉండవలసిన లక్షణాలను స్పష్టీకరించినాడు.

**“ఆశలను లేదా కోరికలను మొదలంట త్రుంచివేసి, అగ్నివలె మనస్సును శరీరాన్ని దహింపచేసే కామవికారాదులను అణచివేసి, నిరాడంబర వేషధారణతో తనను గురించి తాను తెలిసికొన్నవాడు (ఆత్మతత్త్వజ్ఞానం పొందినవాడు) గొప్ప యోగి అని వేమన నాలుగు మాటలలో సూక్ష్మంలో మోక్షం అన్న విధానంలో వివరించాడు. ఆచరణాత్మకమైన విధానానికి ఇంతకంటె సూటియైన, శ్రేష్ఠమైన, అర్థవంతమైన**

**నిర్వచనం ఎవరు చెప్పగలరు? "వేదాంతమంటే ఎంత లోతుకు పోయినా అర్థం కాదు" అన్న సామాన్యుల అభిప్రాయమును వేమన వంటి వారే మార్చి వేసి సరైన బోధ చేయగల బోధకులు.**

ప్రతి మనిషికి తెలిసిన నిజము – అనేక మంది ఆచార్యులు, గురుస్థానీయులు, గ్రంథకర్తలు బోధించిన సత్యము – అయినను ప్రాపంచిక బంధములకు కట్టుబడి ఎవరికి వారు ప్రక్కకు నెట్టిన యథార్థము. ఏదో ఒక సందర్భంలో భక్తితోనో, విరక్తితోనో, మోక్షేచ్ఛతోనో అనేకమంది వాకొను వేదవాక్కువంటి విలువైన వాక్కు, క్రింది వేమన పద్యములో అక్షరీకరణ పొంది గొప్ప సందేశముగా మారినది.

**"ఏమిగొంచు వచ్చె, ఏమి తాగొని పోవు**
**బుట్టువేళ, నరుడు గిట్టువేళ**
**ధనములెచటికేగు, దానెచటికేగు!**
**విశ్వదాభిరామ వినుర వేమ".**

ఆంధ్రులందరి నోట, ముఖ్యముగా గ్రామీణుల వాడుకలో నేటిదాకా వినబడుతూనే ఉన్న నిత్యసత్యమిది. నరనరాన జీర్ణించుకుని పోయిన ఆధ్యాత్మిక రహస్యమిది. ఏ యోగి మాత్రమింతకంటె అధికముగానేమి చెప్పగలడు?

అదేవిధముగా మానవుడు తన జీవితములో సముపార్జించ వలసిన అత్యంత విలువైన సంపద జ్ఞానము; జీవనాధారము నిమిత్తము సాధించే జ్ఞానము కంటె భిన్నమైన సాంస్కృతికము, తాత్త్వికమునైన జ్ఞానమిది. కొంత వినుటవలన, కొంత చదువుట వలన, కొంత పరిశీలన వలన మరికొంత ఆచరణ లోను మానవుడు సుసంపన్నుడు కావడానికి తోడ్పడే ఆత్మజ్ఞానమిది. తత్త్వజ్ఞానమిది. మతపరముగానో, మరొక విధముగానో నేర్వవలసిన, మానసిక పరిపక్వతకు తోడ్పడగల ఆధ్యాత్మిక విద్య ఇది. ఈ విద్య హృదయాంతర్గతమై నిత్యమై, సత్యమై, శాశ్వతమై ప్రకాశించును. "సచ్చిదానందస్వరూపసమానమైనదిది". అట్టి జ్ఞానము నార్జించినప్పటి స్థితిని వేమన చిన్న ఉదాహరణముతో తెలియపరచుట చాల గొప్ప విషయము (తీసికొనవలసిన జాగ్రత్తకూడ పరోక్షముగా సూచితము)

**"గాజుకుప్పెలోన కదలక దీపంబ**
**దెట్టులుండు, జ్ఞానమట్టులుండు**
**దెలిసినట్టి వారి దేహంబులందును**
**విశ్వదాభిరామ వినుర వేమ".**

గాజుకుప్పెలోలేని దీపము వాయుహతమై కాంతిని పోగొట్టుకొనుట సర్వజనవేద్యమే గదా.

ప్రతి ప్రాణి తన శరీర పరిరక్షణ కోసము పాటుపడటం సహజమే. కాని మేధావియైన మనిషి ఈ కార్యక్రమంలో భాగంగా అనేకానేక విధములుగా యావచ్ఛక్తి యుక్తులను వినియోగించటం, కొన్ని సందర్భాలలో అక్రమాలకు పాల్పడటం లోకంలో అడుగడుగునా కనిపించే విషయాలే. ఎంత కష్టపడి సంపాదించినా, ఎంత గొప్పగా శరీరాన్ని పెంచి పోషించినా ఏదో ఒకరోజున ఈ శరీరాన్ని వదలక తప్పదు. జన్మ ఎంత నిజమో మరణం కూడా అంతే నిజము. చనిపోయినప్పుడు తాపత్రయపడి సంపాదించిన సొమ్ములు తీసుకు పోవాలంటే సాధ్యము కాదు. పాపపుణ్యాలు మాత్రమే ఆ జీవుని సొంతమౌతాయి. కాని మానవులు ఈ భూమిపై తాము శాశ్వతమన్నట్లుగా భ్రమలో పడి జీవితాలను కొనసాగించుతూ ఉంటారు. ఎంత మేధావియైనా, శాస్త్రవేత్తయైనా ప్రాణాలు పోకుండా కాపాడే శక్తినిగాని విద్యను గాని ఇంతవరకు కనిపెట్టలేదుకదా! అటువంటి స్థితి నుండి మానవుని మరలించి తనను, తనతోటి వారిని గురించి ఆలోచింపచేసే విధంగా వేమన కలం నుండి జాలువాఱిన నిత్యసత్యాన్ని క్రింది పద్యంలో చూడవచ్చును.

**"తనువదెవరిసొమ్ము తనదని పోషింప**
**ద్రవ్యమెవరి సొమ్ము దాచు కొనగ**
**బ్రాణమెవరి సొమ్ము పారిపోవక నిల్ప**
**విశ్వదాభిరామ వినుర వేమ".**

వేమన వేదాంతదర్శనం – సందేశం అంతా సామాన్యజనం ఆధారంగా సామాన్యుల కొరకు జరిగిన ప్రస్థానమే. భారతదేశపు ఆధ్యాత్మిక శక్తికి మేధస్సుకు ప్రతీకగా చెప్పదగిన వివేకానందుని అంతర్దర్శనం కూడ ఇటువంటిదే.

1896 నవంబరు నెలలో లండన్‌లో వివేకానందుడు చేసిన ప్రసంగంలోని కొన్ని వాక్యాలివి. సందర్భం ఏదైనా అభిప్రాయం మాత్రం ప్రసంగకర్తదే.

Now there are two principles of knowledge. One principle is that we know by referring the particular to the general, and the general to the universal, and the second is that any thing of which the explanation is sought to be explained so far as

possible from its own nature. వేమన చెప్పిన జ్ఞానమార్గం అధిక భాగం ఈ రెండవ విధానానికి సంబంధించినది మాత్రమే.

ఇదే విధముగా అనుభవము, ఆలోచన, పరిశీలన, లోకరీతి యథార్థం అనే అంశాలు భూమికలుగా రూపుదిద్దుకొన్న క్రింది పద్యం కూడా ఒక రత్నం వంటిది.

**వేషభాషలెరిగి కాషాయవస్త్రముల్**
**కట్టగానె ముక్తికలుగబోదు**
**తలలుబోడులైన తలపులు బోడులా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

నిజమైన యోగం, సన్యాసం మొదలైనవన్నీ మనస్సుకు సంబంధించిన అంశాలు మాత్రమే. ఆకారానికి, వేషభాషలకు ముడిపెట్టి చూస్తే దొంగ సన్యాసులు, కుహనా పరివ్రాజకులు ఎంతోమంది కన్పించవచ్చు. తస్మాత్ జాగ్రత్త! అనే హెచ్చరిక కూడా అంతర్లీనంగా ఉన్నదిక్కడ. వేమన పద్యాలను సవివరంగా పరిశీలించినప్పుడు బాహ్య, అంతరంగ ప్రపంచాలతో పాటు సమాజంలోని అనేక విధి విధానాలు, ఆచారాలు, వ్యవస్థిత సమస్యలు మొదలైన ఎన్నో అంశాలు వేమన మనోవీథిలో పరిభ్రమించి అక్షరరూపం దాల్చి వేమన శతకంలో శాశ్వతత్వాన్ని సంపాదించుకొన్నవని చెప్పటం అతిశయోక్తి కాదు. వేమన సమకాలీనులపై ఎంత ప్రభావం చూపించాడు అనే విషయాన్ని నిర్ధారించటం కష్టసాధ్యం కావచ్చు. కాని ఆధునిక సమాజాన్ని తనవైపు ఆకర్షించుకుని జీవన సత్యాలను రుచిచూపించడం మాత్రం యథార్థం. వేమన శతకం అన్న పేరును బట్టి పద్య సంఖ్య నూరు లేదా నూటయెనిమిదికి నియంత్రించబడలేదు. వందలాదిగా పద్యాలు వేమన రచితాలుగా లభ్యమౌతున్నవి. కొన్నింటిని ప్రక్షిప్తాలుగా నిర్ధారించినప్పటికిని వేమన సంఖ్యానియమాన్ని పాటించలేదన్నది నిర్వివాదాంశమే. ఆంగ్లేయుడైన C.P. Brown ను సైతము వేమన సాహిత్యం కట్టిపడవేసింది. తత్ఫలితంగానే 'ఆరువందల పైచిలుకు' పద్యాలకు 'బ్రౌను' 'Verses of Vemana' అనే పేరుతో ఆంగ్లానువాదం చేశాడు. యోగిగా ప్రజల కవిగా **యోగివేమన** సర్వులకు, సర్వకాలాలకు ఆదరణీయుడు. మార్గదర్శకుడు.



# వేమనశతకము - యోగరహస్యము.2

**చిత్తశుద్ధి కలిగి చేసిన పుణ్యంబు**
**కొంచెమైన నదియు కొదువగాదు**
**విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత?**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఒక 'ఆటవెలది' పద్యములో, చిన్న పోలికతో 'పుణ్యము' యొక్క స్థాయిని సంపూర్ణముగా ప్రత్యక్షము చేసే ప్రయత్నము సఫలమైనది. 'ముక్తి'ని పొందాలనుకుంటే ఏయే మంచి పనులు చేయాలి. ఏ మేరకు చేయాలి. ఎన్ని పూజలు చేయాలి. ఎంత ఆడంబరముగా చేయాలి. ఎవరిని ప్రార్థించాలి. ఏ గురువును ఆశ్రయించాలి. ఎంత పుణ్యాన్ని సముపార్జించాలి. ఇత్యాది అనేకానేకమైన ప్రశ్నలకు, అనుమానాలకు ఒక్కమాటలోనే ఇక్కడ సమాధానము దొరుకుతున్నది. అదే 'చిత్తశుద్ధి'. చిత్తశుద్ధితో చేసిన పుణ్యము అల్పమైననూ, అధిక ఫలదాయకమే. **'అధికస్య అధికం ఫలమ్'** అను ఆర్యోక్తి కొంత వరకు అనుసరణీయమైనప్పటికిని, చిత్తశుద్ధి లేనప్పుడు అంతా వ్యర్థమేనన్న స్పష్టమైన సందేశమిక్కడ ఉన్నది. అసలు చిత్తశుద్ధి అనగానేమి? చిత్తము నందలి శుద్ధి అని అర్థము చెప్పవచ్చును. ఇక్కడ శుద్ధి అనగా లౌకికార్థమైన శుభ్రతకాదు. ఏవికారములకు లొంగని స్థితిలో నున్న పరిపూర్ణమైన స్వచ్ఛత. చిత్తము అనగా మనస్సు లేదా హృదయము. కావున మనము చేసే పనిలో మనస్సు నిష్కల్మషంగా, స్వచ్ఛముగా ఉన్నప్పుడే దాని ఫలితం ఒనగూడుతుంది. అలా కానప్పుడు లభించే ప్రయోజనాలేవీ శాశ్వతాలు కావు. జన్మాంతరాలకు సంక్రమించే సంపదలు అసలేకావు. పశ్చాత్తాపపడుతూ మరల మరల నిగ్రహం కోల్పోయి తప్పులు చేస్తూ పోయేవారికిది గుణపాఠం. తెలియక చేసిన పొరబాట్లకు పశ్చాత్తాపం పరిష్కారమౌతుందేమో కాని, ఎప్పటికప్పుడు తప్పుగా ప్రవర్తించే అహంకారులకు మాత్రము కాదు. ఇటువంటి దోషాలన్నింటికి ప్రాయశ్చిత్తమే చిత్తశుద్ధి. కాబట్టి దాని ప్రాధాన్యము బుద్ధిజీవులైన మానవులకు అత్యంతము గుర్తించదగినది. సాధించి, ఆచరించి, బోధించవలసిన ఆవశ్యకమైన మానసిక లక్షణము చిత్తశుద్ధి. ఆలోచన, అనుభవము, ఆచరణ, పరిశీలన ఏకత్రమిళితమైనప్పుడు మాత్రమే ఇటువంటి

నిగూఢాంశములను ఇంత సరళముగా చెప్పుట సాధ్యపడుతుంది. వేమన పద్యాలను సాహిత్యాకాశంలో సజీవ చిత్రాలుగా మార్చి ఆమోదయోగ్యముగా మనస్సుకు హత్తుకునే విధముగా చేసిన రహస్యమేమంటే ఒక పాదంలో చెప్పే ఔపమ్యాలే. ఇవన్నీ ప్రతి సామాన్యునికి తెలిసిన అంశాలు కావడం కూడా ఒక కారణం. చిత్తశుద్ధి, పుణ్యము, దాని స్థాయి మొదలైనవాటిని నిర్వచించటంలో ఈ సాదృశ్యాలకున్న శక్తి అనితరసాధ్యము. మఱ్ఱిచెట్టు చాలా దూరము తన ఊడలతో వ్రేళ్ళతో వ్యాప్తి చెందుతుంది. కాని అది మొలిచినప్పుడు ఒక చిన్న మొక్కమాత్రమే. ఆ మొక్కకు కారణభూతమైన గింజ చాలా చిన్నది. ఇది అందరకు తెలిసిన సత్యమే. కాని దీనిని ఎవరు ఆలోచిస్తారు? మరీ ముఖ్యంగా వేదాంతులు జిజ్ఞాసువులు ఇలాంటి విషయాల జోలికి ఎంతవరకు వెళతారు? అలా వెళ్ళగలగటం, చూడగలగడం, చెప్పగలగడం వేమన యోగి ప్రత్యేకత, కొంచెమైనా చిత్తశుద్ధి వలన కలిగే పుణ్యము, దాని పర్యవసానము ఎంతెంతో విస్తృతపరిధి కల్గినవి. మానవజీవితములో చిత్తశుద్ధి, పాపపుణ్యవిచారము, నిర్ణయశక్తి అత్యంత కీలకములు. లౌకిక జీవితానందముతోపాటు, పారలౌకిక జీవితానందము ప్రతివారు సాధించి తీరాల్సిన అంశమే. దానిని సాధించటానికి చేయవలసిన కఠోర పరిశ్రమ సాధన, అన్నీ చిత్తశుద్ధిలో అంతర్భాగాలే కదా!

"Don't remain only a citizen - But be an enlightened citizen".

"Don't remain only - an enlightened citizen - But be a spiritual citizen"

అన్న ఆధునిక సందేశములోని అంతరార్థము వేమన పద్యాలలో అలనాడే స్థానము కల్పించుకున్నది.

**ఆత్మశుద్ధిలేని యాచార మదియేల?**
**భాండశుద్ధిలేని పాకమేల?**
**చిత్తశుద్ధి లేని శివపూజలేలరా?**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఆచారము అనగానేమో ముందుగా విశ్లేషించవలసి ఉన్నది– కులాచారములు, వంశాచారములు, దేశాచారములు, జాతీయాచారములు, సామాజిక, వ్యక్తిగత ఆచారములు ఇత్యాదిగా అనేక విధములుగా వీటిని గురించి వినవచ్చుచున్నది. ఆయా సందర్భాలలో ఆయా ఆచారములను పాటించుట పరిపాటి. ఏ కారణములవలన

ఏర్పడినా అనూచానముగా వచ్చిన కొన్ని విధివిధానాలు, పద్ధతులు, ఆలోచనావిధానాలు మొదలైన వన్నియు ఆచారములే. ఆయా ఆచారములను విచక్షణా రహితముగా, అవగాహన లేకుండా, కార్యకారణ సంబంధము తెలియకుండా పాటించుట సామాన్యుల లక్షణము. కాని వారికి దానిపై పూర్తి నమ్మకము ఉండవలెను. విద్యావంతులు, మేధావులు విమర్శనాత్మక దృక్పథము నవలంబించి పాటించెదరు. కాని మామూలు వారు కేవలనమ్మకమునే ప్రాతిపదికగా తీసికొని పాటించుట సర్వసాధారణము. ఏది ఎట్లున్నను ఆత్మలో విశ్వాసము లేనప్పుడు ఆ కార్యాచరణ వ్యర్థము. ఇచ్చట ఆత్మ అనగా జీవాత్మ, పరమాత్మ వంటి విషయముల జోలికి పోనక్కరలేదు. మనస్సు అనే సామాన్యార్థమే అపేక్షణీయము. ఇటువంటి విషయాలన్నీ పండిత, పామర భేదము లేకుండా ప్రతి ఒక్కరిని ఉద్దేశించి చెప్పినవే కావడం వలన లోతైన విషయ విశ్లేషణ అవసరము లేకపోవచ్చునని ఉద్దేశ్యము.

పాత్రలను పరిశుభ్రముగా ఉంచకుండ మలినముగా నుంచి, వాటిలో వంట చేసినప్పుడు ఆ పదార్థములు విషప్రాయములగును. అటువంటివే కల్మషమైన మనస్సుతో కేవల స్వార్థభావముతో అనుసరించే ఆచారములు, చేసే పూజలు కూడా. మనస్సులో పరిపూర్ణమైన విశ్వాసము, ఏకాగ్రత, ఆత్మార్పణభావము లేని పూజలు బాహ్యాడంబరములు మాత్రమే. పూజకంటే సమర్పణబుద్ధి ముఖ్యము. స్వచ్ఛమైన మనస్సు అత్యవసరము. కావున మనోవికారములను జయించుట ముందుగా చేయవలసిన పని. దానిని సాధించేందుకు అడవులకు పోవలసిన అగత్యం గాని, ఎందరెందరో గురువులనాశ్రయించవలసిన అవసరం గాని లేవు.

**ఒరుని చెరచెదమని యుల్లమందెంతురు**
**తమకు చేటెరుగని ధరణినరులు**
**తమ్ముచెఱుచు వాడు దైవంబులేడొక్కో?**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఇటువంటి సత్యములను గ్రహించిన, గుర్తించిన ప్రతి ఒక్కడు తనకు తానుగా సాధకుడై, సునాయాసముగా చిత్తశుద్ధిని పడయగలడు. సమస్తము దైవమయమని భావించి తన నడతను తాను తీర్చిదిద్దుకొనగలడు. అట్టివాడే **'ఆచరణయోగి'** కాగలడు. మనము చేసే ప్రతి పనికి, తలపెట్టే ప్రతి దురాలోచనకు ప్రత్యక్షసాక్షి భగవంతుడని, తాము చేసిన దుర్మార్గమునకు సరూపమైన ఫలితాలను అతడు మనకందించగలడని

వేమన అభిప్రాయము. అదే విషయాన్ని ఈ పద్యములో వివరించాడు. **“భగవంతునిపై నిజమైన నమ్మకమున్నవాడు చెడుప్రవర్తనకు లోను కాలేదు”**. అన్న సామాజిక విశ్వాసమిక్కడ దర్శనమిస్తున్నది.

"Life without devotion is a temple without a deity" వేమన ఆత్మశక్తిని గుర్తించిన తేజోశాలి. లోకరీతిని పరిశీలించిన అనుభవశాలి. వేమన చెప్పిన సత్యాలు సకల జన శిరోధార్యాలు. ఎన్నోవాదాలు, సిద్ధాంతాలు, ఆధునిక విజ్ఞాన వీచికలలో తేలియాడుతున్న యథార్థాలు వేమన మనస్సులో ఆలోచనలుగా ఆవిర్భవించి చిన్నచిన్న పద్యాలుగా రూపు దాల్చినాయనడం తప్పుగాదు. అతనికి అంతఃశత్రువుల గురించిన ఆలోచనే అన్నింటికి ప్రాతిపదికగా కన్పించడం వల్ల కావచ్చు. ఆ విషయం అనేక చోట్ల వక్కాణించటం జరిగింది.



# వేమనశతకము - యోగరహస్యము.3

**మాటలాడు టొకటి, మనసులో నొక్కటి**
**ఒడలి గుణమువేరె, యోజవేరె**
**ఎట్లు గల్గు ముక్తి ఈలాగు తానుండ**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

వేమన పద్యాలలో పదేపదే కన్పించిన 'చిత్తశుద్ధి' అనే పదానికి ఈ పద్యమొక చక్కని వివరణ. సరైన నిర్వచనము, సూటియైన సమాధానము. "లోపల ఒకటి, బయట వేరొకటి" అనడం లోక సాధారణము. అనగా మనసులో ఆలోచనను దాచిపెట్టి సమయానుసారముగా ఏదో ఒకటి మాట్లాడటం అన్నమాట. కల్లబొల్లి కబుర్లు, అర్థం లేని వాగ్దానాలు, లేనిపోని భేషజాలు, కుట్రలతో కూడిన జీవిత విధానాలు మొదలైనవన్నీ పై పద్యములోని మొదటి పాదముతో ముడిపడిన అంశాలే. కాని నీతి, నిజాయితీ గల వ్యక్తులు ఆ విధంగా ప్రవర్తించరు. ప్రవర్తించకూడదు – సామాజిక జీవితములోనేమి, ఆధ్యాత్మిక అంశాలలోనేమి సూటిగా ఉండటం చాల అవసరము. ఇదే కొంచెము పై స్థాయిలో చెప్పాలంటే త్రికరణశుద్ధి. త్రికరణములు అనగా మనోవాక్కాయ కర్మలు. మనసు, మాట, చేత అను మూడును త్రికరణములైనప్పుడు ఆలోచనల్లో లేదా అంతరంగంలో ఏదైతే ఉన్నదో దానినే చెప్పటం, చెప్పిన దానినే ఆచరణలో పెట్టడము త్రికరణశుద్ధి అవుతుంది. ఋజువర్తన గలవారు, సాత్వికులు, ఆత్మార్పణ బుద్ధిగల తాత్త్వికులు, యోగులు, భక్తులు ఈ విధముగానే ప్రవర్తిస్తారు. ఇటువంటి స్వచ్ఛమైన మనస్సు, ఆలోచన, నడత, ఆచరణ గలవారికి మాత్రమే ముక్తి లభిస్తుందని వేమన అభిప్రాయము. అదే విషయమిచట స్పష్టమగుచున్నది. శారీరకమైన లక్షణము, అభివ్యక్తీకరణ మొదలైన అంశములు, ఆలోచనలకు భిన్నముగా (కృత్రిమముగా) ఉన్నప్పుడు మోక్షము రాదని సారాంశము. 'ముక్తి' అనగా భవబంధముల నుండి విముక్తి అనియే కదా అర్థము. కేవలము పూజలు, బాహ్యాడంబరములు, ఆచరణ శుద్ధిలేని చదువులు, ఉపన్యాసములు, పాండిత్యము, తపస్సు మొదలైనవన్నీ వ్యర్థములేనని స్పష్టము. ఇక్కడ కూడా ప్రతి పనిలోను 'చిత్తశుద్ధి' అవసరమని వేమన స్పష్టము చేసి ఆచరణ యోగ్యమైన యోగస్థాయిని సామాన్యులకు చేర్చి బోధించి గొప్ప గురువు అయ్యాడు.

గురువు అనగా నెవరు? ఉపదేశకుడు, బోధకుడు, పెద్దవాడు, తండ్రి మొదలైన అర్థములు అందరికీ సుపరిచితములే. కాని ఆ గురువు ఎలా ఉండాలి అన్నది ముఖ్యాంశము. గొప్ప మార్గదర్శకుడుగా ఉండాలి. ద్రష్ట మరియు స్రష్టగా తన శిష్యులను తీర్చిదిద్దగల ఔన్నత్యము, స్వచ్ఛమైన ప్రేమ భావము, కర్తవ్యనిష్ఠ, మనోనిగ్రహము కలిగి ఉండాలి. అంతేగాని తనను తాను చక్కదిద్దుకొనలేనివాడు ఇతరుల నెట్లా తీర్చిదిద్దగలడు. లేనప్పుడు ఉపయోగమేమిటి? ఆధ్యాత్మిక గురువు కావచ్చు, కేవల విద్యాబోధకుడు గావచ్చు. ముందు స్వచ్ఛమైన మనస్సు, అంకితభావము పెంపొందించుకోవాలి. ముఖ్యముగా ఈనాటి సమాజములో శాస్త్ర సాంకేతిక విద్యలు రాశిలో వాసిలో రాణిస్తూ ఉన్నప్పటికిని, వ్యక్తిత్వాన్ని, మానసిక పరిపక్వతను పెంపొందించే గురువులు అరుదుగా ఉండటం వలన, అవకాశాలు తగ్గి పోవటం వలన మానవీయ విలువలు, సాంస్కృతిక విలువలు దిగజారుతున్న విషయాన్ని మనం గమనించవచ్చు. ఈ విషయమే వేమన పద్యాలలో ఒక చక్కని పద్యముగా మారి గురువుల స్థానాన్ని గుర్తు చేస్తున్నది.

**అన్నిదానముల కన్న అన్నదానమె గొప్ప**
**కన్నతల్లి కంటె ఘనము లేదు**
**ఎన్నగురుని కన్న నెక్కుడులేరయా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఒక ప్రాణి బ్రతకాలంటే ఆధారం తిండి. మన ప్రాంతములో అన్నము ప్రాణం నిలబెట్టటం లేదా నిలబెట్టుకోవడం మొదటి ప్రాధాన్యంతో కూడిన అంశం. ప్రాణమున్నప్పుడే కదా దేహచైతన్యం. ఆ చైతన్యం ఉంటేనే గదా కర్మాచరణ. అందువలన దానాలలో అన్నదానానికి ప్రథమస్థానమిచ్చాడు. అన్నం అనే దానికి ఆహారమని శాస్త్రసామాన్యార్థం. "శరీరమాద్యం ఖలు ధర్మసాధన"మని గదా ఆర్యోక్తి. మరి ఆ శరీరం రూపుదిద్దుకొని జన్మను పొందటానికి, జన్మించిన శిశువుకు పోషణ, రక్షణ అందించటానికి కారణం తల్లి. ఆ బిడ్డ శారీరక పెరుగుదలతోపాటు, మానసిక పరిపక్వత, మంచి, చెడు విచక్షణ, వివేకం మొదలైనవన్నీ ముందుగా తల్లి పెంపకంలోనే అబ్బుతాయి. తల్లి స్థానం వ్యక్తికి, కుంటుంబానికి జాతి అభివృద్ధికి, జాతి గౌరవానికి దోహదం చేస్తుందన్నది నిర్వివాదాంశం. రెండవ పాదంలో వేమన దానిని గుర్తుచేశాడు. చివరగా మనిషిని మనిషిగా నిలబెట్టటంలో గురుదేవుల పాత్రను గుర్తుచేస్తూ మూడవ పాదాన్ని ముగించాడు. ఈ విధంగా అనల్పమైన, శక్తివంతమైన ఎన్నో విషయాలను

వేమన సున్నితంగా సులభంగా చెప్పిన తీరు అమోఘం. వేమన కూడ తను చెప్పిన సిద్ధాంతాల్ని ఆచరించి చూపిన నిశ్శబ్దమార్గగామియైన గురువే.

**అన్నమిడుటకన్న అధికదానంబుల**
**నెన్ని చేయనేమి, యెన్నబోరు**
**అన్నమెన్న జీవనాధారమగునయా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

అని మరొక్క మారు ఆహారము యొక్క ప్రాధాన్యాన్ని, అవసరాన్ని, అన్నదానపు గొప్పతనాన్ని వేమన నొక్కి చెప్పాడు. ఇటువంటి సామాజిక సేవా దృష్టి, దయాదృష్టి, అవసరానవసర విచక్షణ వేమనను మహాకవిగా సాహితీలోకంలో నిలబెట్టినవి.

మరొక విషయం ఏమంటే చేసేదానం ఎలా చేయాలి. మనస్ఫూర్తిగా అనేది అందరూ చెప్పే సమాధానమే. దీనివల్ల ఏమి కలుగుతుంది? అంటే పుణ్యము, పురుషార్థము, సంతోషము, సంతృప్తి మొదలైనవన్నీ. దానము తీసికొన్నవాడికి కలిగే దొకరకమైన ఆనందమైతే ఇచ్చిన వారికి కలిగేది మరొకరకమైన ఆనందం. అందుకే సంకోచించకుండా, ఇహలోక సంబంధమైన సిరిసంపదలేవీ మనవి కావు అనే విషయాన్ని గుర్తించి, మరీ దానము చేయాలని వేమన అభిప్రాయం. ఏదీ నాదికాదు అనుకోవడం అంటే అహంకార, వికారాలను దూరం చేసికోవడమే కదా. అంతా భగవంతుని సొంతమే. గ్రహగమనాలు మన జీవన మార్గానికి (అనగా మనం మనంగా ఉంటూనే భగవంతుని పొందడానికి) స్ఫూర్తిగా, ఆయన లీలలో అంతర్భాగమేనని, మనం కేవల సాధనాల వంటి వారమేనని నమ్మగల్గినపుడు సంపత్సంబంధమైన లంపటం మనస్సును తాకదు. అటువంటిదే నిజమైన దానము. నిజమైన ధర్మాచరణ. ఏదేని యొక ప్రయోజనమును గాని, ఇష్టాయిష్టములనుబట్టిగాని చేయు దానము నూటికి నూరు పాళ్ళుగా ధర్మాచరణ గానేరదు. అదే విషయాన్ని వేమన క్రింది విధంగా చెప్పాడు.

**అరయ నాస్తియనక, యడ్డుమాటాడక**
**తట్టుపడక, మదిని దన్నుకొనక**
**తనది కాదనుకొని తాబెట్టునదె పెట్టు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

మన పురాణాలు, ఉపనిషత్తులు దానశీలుర గురించి అనేక ఆఖ్యానాలను వాకొన్నాయి. ప్రతి ఒక్కరు పైన చెప్పిన లక్షణాలతో దానం చేసిన వారే కన్పిస్తారు.

భాగవతంలో కూడా **రంతిదేవుని కథ,** వామనుని కథ మొదలైనవి ఇటువంటివే. ఈ ఒక్క పద్యమే అటువంటి ఉపనిషత్సారాన్ని అందించగల మహాకావ్యమంత గొప్పదిగా కన్పిస్తున్నది. ఇది గుర్తించిన మానవునికి ఏ తాపత్రయాలు దరిచేరవు. ఈ జన్మ, జీవితం భగవద్దత్తాలు. సిరి సంపదలు, కీర్తి ప్రతిష్ఠలు, మంచి చెడు సమస్తం ఆ భగవంతుడిచ్చినవే. అలౌకిక శక్తి గల్గిన ఆ భగవత్తత్వమే ఈ ప్రకృతికి, సృష్టి, స్థితి లయాలకు కారణమైనపుడు ఏది మాత్రం మన సొంత మని చెప్పగలం. కాని లౌకిక జీవితం గడుపుతున్నందువల్ల తనది, తాను అనే భావం జీవితం పట్ల సానుకూల దృక్పథాన్ని కల్గించడానికి అవసరమే. కాని అది శాశ్వతం కాదు. ఇది మాయావృతమైన జీవనం. భగవంతుడు నిత్యుడు. శాశ్వతుడు. ఆత్మలో ఎఱుకను పొందడం అవసరమని మానవుడు గుర్తించిననాడు కోరికలు దుఃఖాలు, ఇతర ప్రతికూలతలు మానవ జీవితాన్ని అతలాకుతలం చేయజాలవు, **తామరాకు మీద నీటి బొట్టు లాగా జీవించ గలవారే ధన్యులు.** క్రింది పద్యం అక్షర లక్షల విలువైనది.

**తనువదెవరి సొమ్ము తనదని పోషింప**
**ద్రవ్యమెవరి సొమ్ము దాచుకొనగ**
**బ్రాణమెవరి సొమ్ము పారి పోవక నిల్వ**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఈ శరీరాన్ని ఎంత గొప్పగా, అభిమానంగా పెంచి పోషించినా అది శాశ్వతము కాదు. ఏదో ఒకరోజు వదలక తప్పదు. ఎంత కష్టపడి సంపాదించినా సొమ్ము శాశ్వతము గాదు. “లక్ష్మీచంచలా” అన్నమాట క్రొత్తదేమీ కాదు. ఇంకొక్క విషయం ఆలోచిస్తే తనువు త్యజించి నపుడే దాని ద్వారా సంపాదించిన సమస్తమైన ఆస్తిపాస్తులను వదలక తప్పదు. మరణానంతరము చేసిన కర్మల తాలూకు పాపపుణ్యాది ఫలములు తప్ప యే ఇతర సంపదలు మన వెంట రావు. వీటిని అనుభవించాలంటే శరీరంలో ప్రాణమున్నంత వరకే సాధ్య పడుతుంది. భోగాల మీద ఆసక్తితో, ప్రాపంచిక సుఖాల పట్ల ఆకాంక్షతో ప్రాణాలు పోకుండా నిలబెట్టాలనుకుంటే ఎంతటివారికైనా సాధ్యపడదు. ఏ విజ్ఞాన శాస్త్ర ఫలితాలు ఈ విషయంలో కృతకృత్యం కాలేదు. ఇటువంటి నగ్నసత్యాలు తెలిసి కూడ, మోహాంధకారమగ్నులైన మానవులకు కనువిప్పు కల్గించడానికి ఇంతకంటె పదునైన సిద్ధాంతాలేమి కావాలి? ఎంత సుబోధకమైన పద్ధతిలో యోగి వేమన జీవన వేదాంతాన్ని బోధించాడో కదా! వేమన పద్యములలో వెదకి జూచినను దైవము అను మాట తప్ప ఇతరముగా ఆయా మతములకు

చెందినవిగా గాని, మరేమైనా గాని పేర్లు కనపడవు. అతడు కులమతతత్త్వాలకు, మూఢాచారాలకు వ్యతిరేకి. ఆస్తికుడు. ఇటువంటి హేతుబద్ధత కలిగి ఉన్నవాడు కావుననే కొన్ని నమ్మకాలను నిర్ద్వంద్వంగా విమర్శించాడు. అటువంటిదే ఈ క్రింది పద్యము.

**కనకమృగము భువిని కద్దు లేదనకను** (లేదు+అనకను=లేదని అనకుండా)
**తరుణి విడిచి చనియె దాశరథియు**
**తెలివిలేనివాడు దేవుడెట్లయ్యెరా!**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

శ్రీకాకుళాంధ్ర శతకము మొదలైన వాటిలో దేవుని గురించి ఇట్లే విమర్శించు చున్నట్లున్న పద్యములు కొన్ని కలవు. అవి స్తుతి గర్భితములై నిందా ముఖమున వ్రాయబడినవి. 'వ్యాజస్తుతి' అలంకారమచట చోటు చేసికొన్నది. కాని పై పద్యమును చూడగా అటువంటి భావమేమాత్రము కలుగదు. వేమన పద్యములను చదివి, అతని ధోరణినర్థము చేసికొన్నవారెవరు దీనిని విమర్శగా తప్ప మరొక రకముగా ఆలోచించలేరు. ఏదేమైనా రామాయణకథలోని మాయలేడి వృత్తాంతాన్ని గుర్తుచేసి, రాముని తెలివితక్కువ వానిగా చెప్పడమన్నది ఆధ్యాత్మిక భావ సంపన్నులు హర్షించే అంశం కాదు, కాని అలాంటి స్తుతులకు, నిందలకు అతీతంగా తనకు తోచిన భావాలను నిర్మొగమాటంగా, నిష్కర్షగా చెప్పే మనస్తత్వం, కవితా విధానం, భావ విప్లవం వేమన కవికి అలంకార ప్రాయమైన లక్షణాలు. అటువంటి భావావేశం నుండి నెమ్మదిగా జాలువాఱిన పద్యమే ఇది. అంతకు మించి రాముని కారణజన్ముడుగా నిరూపించే ఆలోచన ఇక్కడ కనిపించదు. "లోకో భిన్న రుచిః". ఎవరి అభిప్రాయాలు వారివి. సహేతుకంగా ఆవిర్భవించిన ప్రతి ఆలోచనను, ప్రతిమాటను, సాహిత్యాన్ని మథించి అవసరం మేరకు ఆస్వాదించడము, జీవితాన్ని పండించుకోవడము పాఠకుని కర్తవ్యంగా మనం గుర్తించాలి.



# వేమనశతకము - యోగరహస్యము.4

**కర్మమధికమయిన గడచి పోవగరాదు**
**ధర్మరాజు తెచ్చి తగనిచోట**
**గంకుభట్టు చేసె గటగటా దైవంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఎవరికైనా చేసిన పాపపుణ్యాది కర్మల తాలూకు ఫలితాలను అనుభవింపక తప్పదు. ఎంతటి మహానుభావులకైన దీనిని అతిక్రమించటం సాధ్యం కాదు. ఉదాహరణకు సార్థక నామధేయుడుగా పేరుగాంచిన ధర్మరాజు విరాటమహారాజు కొలువులో కంకుభట్టుగా కొంతకాలం (అజ్ఞాతవాససమయం) దైవ నిర్ణయానుసారం గడపవలసి వచ్చింది. కాబట్టి ఎంతటి వారికైనా కర్మానుభవం అనతిక్రమణీయమే.

"కర్మణః సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।
రజసస్తు ఫలం దుఃఖమ్, అజ్ఞానం తమసః ఫలమ్ ॥"

అని గీతావచనము. సుకృతకర్మల ఫలం సాత్త్వికంగా, నిర్మలంగా ఉంటుందని, రజోగుణ సంబంధమైన కర్మఫలము దుఃఖమని, తమోగుణ సముత్పన్న కర్మల ఫలము అజ్ఞానమని పై శ్లోక భావము. ఈ మూడు గుణములు మానవునకు జన్మతః సంక్రమించినవైనప్పటికిని, బుద్ధిజీవియైన మనిషి రజస్తమోగుణములను నియంత్రింప సమర్థుడు. అటువంటి నియంత్రణ ఉన్న మానవుడే మహనీయుడౌతాడు. కర్మఫలితాన్ననుభవించే విషయంలో మన నిర్ణయాలకు, మనమిచ్చే ప్రాథమ్యాలకు అవకాశం ఉండదు. అందుకే జూదంలో పెట్టుకున్న షరతుల ప్రకారం అరణ్య అజ్ఞాతవాసాలు పాండవులకు తప్పలేదు. అందరి మన్ననలకు పాత్రుడైన ధర్మరాజు సంవత్సరకాలం పాటు కంకుభట్టుగా జీవించక తప్పలేదు. మానవులలోని బలహీనతలను నిష్కర్షగా ఎత్తిచూపే వేమన మాత్రం ఈ విషయంలో కొంచెం నిదానించి, ధర్మరాజు దైవగతి వలన దుస్థితి పాలైనాడని చెప్పి తన అంతరాంతరాల్లో ఉన్న నమ్మకాన్ని, లోకరీతిలోని ఆలోచనలకు జోడించి చెప్పాడు. ఇటువంటి పాపపుణ్య విచారణతో కూడిన మరొక పద్యమును గురించి ఆలోచింతము.

**రాముడొకడు పుట్టి రవికులమీడేర్చె**
**కురుపతి జనియించి కులము జెరచె**
**ఇలను బుణ్యపాప మీలాగు కాదొకో**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఈ పద్యములో పాపపుణ్యముల తీరును – ప్రయోజనమును గూర్చిన ప్రస్తావన వచ్చినది. "రాముడు పుట్టి సూర్యవంశాన్ని ఉద్ధరించాడు. దుర్యోధనుడు పుట్టి కురువంశాన్ని భ్రష్టం చేశాడు. మంచి చెడుల ఫలితాలు ఈ విధంగానే ఉంటాయని భావం". రామాయణ భారతాలు రెండూ భారతీయులకు గొప్ప ఇతిహాసాలు. బాల్యంలో భారతం చదవాలి. యౌవనంలో రామాయణం చదవాలి. బాల్యంలోనే మానసిక స్థితిగతులు అసూయా ద్వేషాల పర్యవసానాలు మొదలైన అంశాల గురించిన బీజం పడాలి. ఎవరెవరిని ఆదర్శంగా తీసుకోవాలో, తీసుకోవచ్చునో తెలుసుకునే శక్తి కలగాలి. ఆపైదశలో వ్యక్తిగతధర్మం, సాంఘిక ధర్మం, రాజధర్మం మొదలైన వాటిపట్ల అవగాహనతోపాటు, ధర్మాచరణ, ధర్మనిరతి పెంపొందాలి. చివరకు పరిపూర్ణత సాధించగలగాలి. ఇది మానవుని జీవితంలో అంచెలంచెలుగా సాగవలసిన పరిణతి. అంతేగాని బీజం ఒకటి వేసి, ఫలితం మరొకటి రమ్మంటే రాదుగదా.

మన ప్రాచీన పౌరాణిక గాథలు, చారిత్రక గాథలు బాల్యం లోనే చెప్పటం వలన తెలియకుండానే పిల్లల మనోఫలకాలపై వాటి ముద్ర పడుతుంది. ఆ ప్రభావం అనంతర కాలంలో వారి ప్రవర్తనలో, జీవన విధానంలో ప్రతిఫలిస్తుంది. ఈ పై పద్యం చదవటమంటే కేవలం రెండు పేర్లు తెలుసుకోవడం కాదు. రెండు విభిన్న విధానాలు, విభిన్న మనస్తత్వాలు, భిన్న ఆదర్శాలు, భిన్న చరిత్రలు తెలుసుకోవాలి.

"రామో విగ్రహవాన్ ధర్మః" అనేది రాముని వ్యక్తిత్వాన్ని గూర్చిన ప్రశంస. ధర్మానికి కట్టుబడి స్వీయ జీవితాన్ని కష్టాలమయం చేసుకున్న రాముడిని, దేవుడుగా ఎందుకు భావించవలసి వచ్చిందో అందరికీ తెలిసిన విషయమే. ఆ సారాంశమంతా పైనున్న చిన్న ఆర్యోక్తిలో ఇమిడి ఉన్నది.

అదేవిధంగా దుర్యోధనుని ప్రవర్తన చేష్టల వెనుక అసూయాగ్రస్తమైన ఆత్మాభిమానం దాగి ఉంది. ఆత్మాభిమానం ప్రతిఒక్కరికి ఉండి తీరవలసిందే. కాని అది అసూయతో కప్పివేయబడినప్పుడు మసకబారిన అద్దంలాగా మారిన మనసు వంకర పోకడలు పోక మానదు. పర్యవసానం అశాంతి, వినాశం. కవులు

"మానధనుండైన భూపతి సహియింపనోపునే సపత్నుల వృద్ధియు నాత్మహానియున్" అని దుర్యోధనుని మనస్తత్వాన్ని దుర్యోధనుని పాత్ర ద్వారానే చెప్పించారు. ఆ సహనశక్తి లేకపోవడమే ఆత్మ వినాశనకారిగా మారింది. కాబట్టి పై పద్యం చదువరులకు ఏది పెంపొందాలి. దేనిని విడనాడాలి అనే ఆలోచనను రేకెత్తించాలి. అపుడే వేమన నిర్దేశించిన ప్రయోజనం సమకూరుతుంది.

**పుట్టిన జనులెల్ల భూమిలో నుండిన**
**బట్టునా జగంబు పట్టదెపుడు**
**యముని లెక్కరీతి నరుగుచునుందురు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

"జాతస్య హి ధ్రువో మృత్యుః" పుట్టిన ప్రతిప్రాణి గిట్టక తప్పదు. గిట్టుట అంటే మరణించడమని అర్థం.

కాని మానవులు మరణమును అనుల్లంఘనీయమని గుర్తించియు దానిని గూర్చి భయపడుట యథార్థము. ఈ విషయాన్ని ప్రజలకు, పాఠకులకు గుర్తుచేసి జీవిత రహస్యాన్ని బోధించటమే వేమన ఉద్దేశం కావచ్చును. లోకులాడు రీతిలో పుట్టినవారందరూ శాశ్వతులై భూమిపైననే ఉండిపోయినచో ఈ భూమి పట్టదని" వేమన అతి సామాన్యంగా ఈ మాటను చెప్పుట జరిగింది. అంటే ఒకరకంగా మృత్యువును చాల మామూలుగా తీసుకోవాలన్న అర్థాన్ని ఇక్కడ ధ్వనింపచేస్తున్నాడు. భారతీయతత్త్వశాస్త్రానుసారం మరణమనేది శరీరానికి మాత్రమే. ఆత్మ లేదా ప్రాణం (జీవుడు) నశించదు. ఆ ఆత్మ అనంతప్రకృతిలో కలిసిపోయి, ఆ తర్వాత మరొక రూపంలో జన్మను గ్రహిస్తుంది. ఆ జన్మ గతజన్మలో చేసిన కర్మలను అనుసరించి ఉంటుంది. కాబట్టి ఈ జన్మలు, జీవితాలు అశాశ్వతం. వీటికై పరుగులు పెట్టడం, తాపత్రయపడటం, భ్రమతో తననుతాను మరచిపోయి ప్రవర్తించడం వంటివి సమర్థనీయాలు కాదు. **ఏ రూపంతో జన్మించామో, దానికి తగినట్లుగా జీవించాలే తప్ప అనవసరపు ఆర్భాటాల జోలికి పోరాదని తత్త్వవేత్తల సందేశం.** కాబట్టి జీవిత కాలం పూర్తి అయిన తర్వాత దక్షిణ దిక్పతి, ధర్మాధర్మగణనా నిపుణుడైన యముని లెక్కల ప్రకారం మరణించి తీరవలసిందేనని వేమన ప్రకటించాడు. యముడు, యమలోకం మొదలైనవాటి పట్ల వేమన విశ్వాసం ఎలాంటిదో తెలియరాలేదు. పదుగురాడు రీతిలో యముని ప్రస్తావన మాత్రం వచ్చింది.

# వేమనశతకము - యోగరహస్యము.5

**పూజకన్న నెంచ బుద్ధి ప్రధానంబు**
**మాటకన్న నెంచ మనసు దృఢము**
**కులముకన్న మిగుల గుణము ప్రధానంబు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అస్తి అనగా ఉన్నాడు లేదా ఉన్నది అనే అర్థము వస్తుంది. భగవంతుడు ఉన్నాడు లేక భగవచ్ఛక్తి ఒకటి ఉన్నది అనే విశ్వాసము గలవారంతా ఆస్తికులు. ఆస్తికులైన వారు భగవంతుని అనేక విధాలుగా అర్చించి అనుగ్రహపాత్రులు కావడానికి ప్రయత్నించటం సర్వసాధారణమే - భాగవతములో పోతన తొమ్మిది రకాలైన భక్తి మార్గాలను ప్రహ్లాద చరిత్రలో చెప్పాడు.

"వందనార్చనముల్ సేవయు నాత్మలో నెఱకయు..."

అని చెప్పిన మార్గాలలో చివరిది యోగులకు, ఋషులకు మాత్రమే అనుభవయోగ్యము. లేదా ఆ స్థాయిలో మానసిక పరిపక్వత, మనోనియంత్రణ సాధించినవారికి సాధ్యమౌతుంది. కాని వందనము అనగా నమస్కారము అందరికి తెలిసిన మార్గము. అర్చనము, సేవ కూడ సర్వత్రా విదితములైనను కొంత మంది చేత మాత్రమే పాటింపబడుతున్న అంశాలు. అర్చనము అనగా పూజ. ఈ పూజావిధానము శాస్త్రోక్తమైన విధానమే. కాని కొంత మంది పూజావిధానము పట్ల విముఖత ప్రదర్శించారు. విగ్రహాలను దేవునిగా భావించి పూజించటమనేది సమర్థనీయము కాదనేది వీరి అభిప్రాయము. ఇటువంటి వారంతా మనసుకు (ప్రార్థన) ప్రాధాన్య మిచ్చారు. ఉదా॥ బ్రహ్మ సామాజికులు మొదలైనవారు. నిర్గుణుడు, నిరాకారుడు నైన భగవంతునికి ఇన్నిరకాల రూపాలు, ఆరాధనలు, అర్చనలు విగ్రహరూపంగా నిర్వహించటం (విగ్రహారాధన) వీరికి అసమ్మతం. సచ్చిదానంద స్వరూపుడు భగవంతుడు అనే వేదప్రామాణ్యాన్ని అనుసరించే హిందూధర్మంలో ఈ విగ్రహారాధన ఎందుకు ప్రవేశించింది అని ఆలోచించినప్పుడు కలిగిన ప్రాథమికమైన ఆలోచన ఏమంటే కేవలము ఏకాగ్రతను కల్గించటమేనేమో అనిపిస్తున్నది. ఒక రూపం, ఒక

విధానం ఉన్నప్పుడు చంచలమైన మనస్సును ఆ విధానం వైపు మళ్ళించి ఏకాగ్రత కల్గించుకోవడం సామాన్యులకు సులభమౌతుందన్నది నిర్వివాదాంశం. కాని ఆ ఏకాగ్రతను ప్రక్కనబెట్టి ఎంత ఆడంబరంగా, ఎంత గొప్పగా పూజ చేయాలి అనే విషయానికి ప్రాధాన్యమిస్తున్న సందర్భాలు అనేకం. అటువంటప్పుడు భక్తిభావము, ఏకాగ్రత, చిత్తశుద్ధి ఏమూలకో చేరుకుంటాయి. జన సామాన్య ధోరణిలో ఇటువంటి పోకడలు గమనించిన వేమన పై పద్యాన్ని వ్రాసి ఉండవచ్చు. ఇంతేగాక మహాభక్తులుగా ఒకవైపు, మహాస్వార్థపరులుగా మరొకవైపు ప్రవర్తిస్తూ దేని దారి దానిదే అన్న మాదిరిగా కరుణ, జాలి, మానవత్వం, నీతి, నిజాయితీ మరచిపోయిన వారికొక హెచ్చరికగానైనా ఈ పద్యాన్ని వ్రాసి ఉండవచ్చు. భగవంతునిపైనున్న నిజమైన ప్రేమ, భక్తి అనే లక్షణాల పరిణామముగా మానవుడు సద్గుణాలను అభివృద్ధిచేసుకోగలగాలి. అదే నిజమైన అర్చన లేదా సేవ. స్వచ్ఛత అనేది శరీరముతోపాటు మనస్సుకు కూడ సంబంధించిన అంశము. ఇటువంటి ప్రాధాన్యము గల గుణాన్ని గురించి ఒక్క మాటలో తేల్చివేయడం వేమన ప్రత్యేకత. మనసు స్వచ్ఛంగా లేనపుడు, ఏకాగ్రత లేనప్పుడు చేసిన పూజ వ్యర్థము. అందుకే పూజ కంటె గుణము ప్రధానమని చెప్పటం జరిగింది.

ఇదేవిధంగా పైకి చెప్పే మాటలు కచ్చితంగా ఉండి మనసులో మెత్తబడితే కార్యసిద్ధి జరగదు. ఆధ్యాత్మికంగానైతే అనవసరం. ఆచరణ ముఖ్యం. సర్వధర్మసారమైన యోగసహిత జ్ఞానము పొందాలంటే శబ్దాలకంటే అనుభవాలమీద, మానసిక పరిపక్వతమీద ఆధారపడటము అవసరము. అందుకే మాటకంటే మనస్సు దృఢంగా ఉండాలి.

ఇక చివరగా చెప్పే అంశము సామాజికమైనది. ఈ సమాజంలో అగ్రకులాలు. అంత్యకులాలు మొదలైన ఎక్కువ తక్కువలు కట్టుబాట్లు వేమన కాలంలో మరీ ఎక్కువగా ఉండేవి. వ్యక్తి యొక్క వ్యక్తిత్వం అతని ఆలోచన, ప్రవర్తనలకు సంబంధించినదే గాని పుట్టుకవల్ల సంక్రమించిన కులానిది కాదు. కులం పేరుతో అర్హులను అణగద్రొక్కడం, అనర్హులను అందలం ఎక్కించడం ఎప్పటికీ, ఏరకంగాను సమర్థనీయం కాదు.

కాని సామాజిక కట్టుబాట్లు, సంప్రదాయాలచాటున అందుకు విరుద్ధంగా జరుగుతున్నప్పుడు ఆ విషయాన్ని నిక్కచ్చిగా విమర్శించి గుణానికున్న ప్రాధాన్యాన్ని చాటి చెప్పిన ప్రజాకవి వేమన. అందుకే కులం కంటె గుణం ముఖ్యమని స్పష్టం చేశాడు. ఈ విధంగా సామాజిక, ఆధ్యాత్మిక ప్రయోజనాలన్నింటిని గూర్చి ఒకే

ప్రయత్నంలో ఆలోచించి పరిష్కారం చెప్పటమే ఈ పద్యంలోని ప్రత్యేకత.

**అంతరంగమందు నపరాధములు చేసి**
**మంచివాని వలెను మనుజుడుండు**
**ఇతరులెరుగకున్న నీశ్వరుడెఱుగడా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

మానవుడు మనస్సులో ఎన్నో తప్పు ఆలోచనలు చేసి, జీవితములో ఎన్నో తప్పులు చేసి, మనస్సాక్షిని కూడ మాయం చేసి, పైకి బుద్ధిమంతునివలె, సజ్జనునివలె ఉంటాడు. అంతమాత్రాన మంచివాడు కాలేడు. తోటి మానవులు తప్పులను గుర్తించలేకపోవచ్చును. సర్వాంతర్యామి యైన భగవంతుడు మాత్రం ఇదంతా తెలుసుకోగలడు. అనగా భగవంతుని నమ్మినవాడు ఆ భగవంతునిపైనున్న భయంతోనో, విశ్వాసంతోనో తన ప్రవర్తన మార్చుకోవాల్సిన అవసరం ఉన్నది. ఇది సామాన్యార్థం మాత్రమే. అదేవిధంగా లోకాచారంగా అనుశ్రుతంగా విన్పించే మాటలు "అన్నీ చూసేవాడొకడున్నాడులే. ఆ పైవాడికి అన్నీ తెలుసు" వంటివి ఎన్నో ఉన్నాయి. మన నరనరాన జీర్ణించుకు పోయిన విశ్వాసం తాలూకు ప్రతిస్పందనలే ఇవి. ఇక మరికొంచెం లోతుగా చూస్తే అంతరంగము, హృదయము మనస్సు అనేవి సమానార్థకాలుగా వాడబడుతున్నాయి.

హృదయంలో స్థిరనివాసం ఎవరిదంటే ఆ భగవత్తత్త్వానిదే. మనలోని జీవాత్మ ఆ పరమాత్మ అంశ. అటువంటప్పుడు మనకు తెలిసిన, మనం చేసిన ప్రతి పని మన మనస్సుకు తెలిసినప్పుడు జీవాత్మరూపంలో వెలుగొందే ఆ పరమాత్మకు తెలియకుండా ఎక్కడికి పోతుంది. సర్వవ్యాపకుడైన భగవంతుని నుండి తప్పించుకోవడం ఎవరికి మాత్రం సాధ్యం?

**మృగమదంబు జూడ మీద నల్లగ నుండు**
**బరిఢవిల్లుదాని పరిమళంబు**
**గురువులైనవారి గుణములీలాగురా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

కస్తూరి చూడటానికి పైకి నల్లగానే కన్పించవచ్చు. కాని దాని వాసన మాత్రము అమోఘము. అనగా పైకి కన్పించినది గొప్పగా లేకున్నను లక్షణము లేదా గుణము చాలా గొప్పది కావలెనన్నది ఇక్కడ సందేశము. గురువుల స్వభావములు కూడ

ఈవిధముగానే ఉండాలి. అనగా గురువు ఆకారము అందమైనదైనా, కాకపోయినా ఫరవాలేదు. కాని అంతరంగము, ఆలోచనాశక్తి, ప్రవర్తన మొదలైనవన్నీ గొప్పగా ఉండాలి. గురువులంటే విద్యాబోధకులు కావచ్చును. ఆధ్యాత్మిక గురువులు కావచ్చును. గురు శబ్దమునకు పెద్ద అని అర్థము. గురువులు అనగా పెద్దవారు, తల్లిదండ్రులు విద్యాబోధకులు అనేవి సామాన్యార్థములు, వీరందరి ప్రభావము మార్గదర్శకత్వము అనంతరతరాలవారిని తీర్చిదిద్దుతాయి. ప్రతి ఒక్కరు తమ బిడ్డలకు జన్మనిచ్చిన తల్లిదండ్రులుగానే గాక మంచి బుద్ధిని, సంస్కారాన్ని, స్వభావాన్ని, నడతను విద్యను, ఆలోచనను అందించి మంచి జీవితాన్నిచ్చిన మాతాపితలుగా గుర్తింపబడాలి. అదేవిధంగా మనకంటె పెద్దవారు మనందరకి స్ఫూర్తి ప్రదాతలు, దిశానిర్దేశకులు కావాలి. విద్యాబుద్ధులు నేర్పిన గురువులు కేవలము చదువును నేర్పడమే కాదు, మంచి వ్యక్తిత్వాన్ని పెంపొందించాలి. మంచి గురువుల శిక్షణలో బాహ్య, అంతరంగ ప్రపంచాలను మనోనేత్రాలతో చదవగల్గిన శక్తి శిష్యులకు లభించాలి. అప్పుడు మాత్రమే తనవంతు పాత్రను కర్తవ్యాన్ని, బాధ్యతను చక్కగా నిర్వహించిన వాడౌతాడు గురువు. ఉత్తమ పౌరులు, ఉత్తమ మానవ జాతి, రూపుదిద్దుకోవడం జరుగుతుంది. అందుకే గదా గురువు అనగా చీకటి నుండి వెలుతురులోనికి నడిపించేవాడన్న అర్థం చెప్పబడింది. ఇక్కడి చీకటి అనగా అజ్ఞానము. వెలుతురు అనగా జ్ఞానము. కాబట్టి గురువుల శారీరక, రూప సౌందర్యాలకంటె ఆత్మసౌందర్యం గొప్పది కావాలి. అటువంటి వారే గురువులు కావాలి. తరతరాలకు తరగని సంపద జ్ఞానమే కదా! అట్టి సంపద నందించగల్గినవాడు, అందుకోగల్గినవాడు ఉన్నంత కాలం దేశసౌభాగ్యం, సౌభ్రాతృత సలక్షణంగా ఉంటాయి. పద్యాలు వల్లెవేయించడమే కాదు. గురువులు తమ కర్తవ్యాన్ని కూడ ఇటువంటి సందర్భాలలో నైనా గుర్తుచేసుకోవాల్సిన అవసరం ఈనాడు ఎంతైనా ఉన్నది.

**కల్లలాడువాని గ్రామకర్తయెరుగు**
**సత్యమాడువాని స్వామి యెరుగు**
**బెక్కుతిండిపోతు బెండ్లామెరుంగురా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఈ పద్యములో అబద్ధాలాడేవాడిని గ్రామాధికారి లేదా ఊరి పెద్ద గుర్తించగలడని చెప్పటంలో ఆ పద్య రచనాకాలం నాటి సామాజిక విధానము ద్యోతకమౌతున్నది. అంత మామూలు విషయాన్ని చెప్పిన వేమన సత్యము పల్కేవాడిని

భగవంతుడు గుర్తిస్తాడని వెన్వెంటనే చెప్పి గొప్ప ఆధ్యాత్మిక సత్యము వైపుకు విషయాన్ని మరలించాడు. ఆ తర్వాత తిండిపోతువాడిని భార్యమాత్రమే గుర్తించగలదని చెప్తూ కొంచెం హాస్యాన్ని జోడించి మరీ మామూలు స్థాయికి తీసుకువచ్చాడు. నిత్యజీవితంలోనే ఆధ్యాత్మికతను, భగవంతుని దర్శించగల వేమన ఈ తీరుగా రచించడం కించిత్తు ఆశ్చర్యంగా కన్పించినా, ఆతని జీవన ప్రయాణాన్ని చక్కగా సూచిస్తున్న అత్యంత సహజమైన విధానమే ఇది.

ఈ సందర్భంలో సత్యాన్ని గురించి ప్రస్తావించడం దేనికి అని ప్రశ్నించుకుంటే ఆ సత్యమే జీవితాలతో పెనువేసుకుని ఉన్న అతి ముఖ్యాంశమని జవాబు చెప్పక తప్పదు. హిందూధర్మశాస్త్రాలననుసరించి జ్ఞానయోగసాధనకు పాటించాల్సిన ముఖ్యాంశాలుగా కన్పించే వాటిలో మొదటిది సత్యస్వరూప విచక్షణ. అనగా సత్యము, అసత్యముల మధ్యనున్న భేదాన్ని గుర్తించగల వివేకము. రెండవది ఇహపరసుఖములపట్ల అనాసక్తి. మూడవది మనోనియంత్రణ మరియు ఇంద్రియ నిగ్రహము, సామాజిక సుఖజీవన ప్రాప్తికి కూడ మొదటిదైన సత్యాసత్యవివేచన మిక్కిలిగా అవసరము. ఆయా సందర్భాలను బట్టి ఉపనిషత్తులు, పురాణాలు, సాహిత్యము సత్యము యొక్క ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పినప్పటికిని బలహీన మనస్కుడైన మానవుడు దానినంత తేలికగా సాధించలేడనేది యథార్థము. ఏదేమైనా సత్యమును పల్కినవాడు భగవంతుని చేత గుర్తింపబడతాడని చెప్పి వేమన సత్యప్రాధాన్యాన్ని, భగవంతుని తత్త్వాన్ని తనదైన అతిసరళశైలిలో మరొక్కమారు స్పష్టం చేశాడు. 'సత్యం వద' అనికదా వేదవచనము.

"సుతశతంబున కంటె సూనృతవాక్యము మేలని" గదా ఆదికవి నన్నయభట్టు భారతములోని సత్యప్రశంస. ఈవిధంగా వేమన ఇహపరములకు తన ఆటవెలదులలో వారధికట్టి, నైపుణ్యాన్ని ప్రదర్శించాడనడం నూటికి నూరుపాళ్ళు సత్యం.



# వేమనశతకము - యోగరహస్యము.6

**ఆశ పాపజాతి యన్నింటికంటెను**
**ఆశ చేత యతులు మోసపోరె**
**చూచి విడచువారె శుద్ధాత్ములెందైన**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఆశ అనేది సామాన్య జీవితాన్ని కొనసాగించేందుకు అవసరమైన అంశమే కావచ్చును. కాని ఈ పద్యములో సామాన్యస్థాయిని దాటి విశేషాంశమే సూచ్యమైనది. దానితోపాటు లోక సామాన్యాభిప్రాయమూ చోటు చేసికొన్నది. "దేనినైనా చూసీ చూడనట్లు పోవాలి" అనేది సందర్భానుసారము లోకంలో వినబడే మాటే. లౌక్యాన్ని బోధించే సలహా ఇది. చాల సులభంగా అర్థమయ్యే రీతిలో చెప్పిన పదబంధం ఇది. "ఆశ పాపిష్టిది" అనేది కూడ సామాన్యపు వాడుకయే. కాని అత్యాశ, నిరాశ ప్రతికూల పరిస్థితుల్ని, ఇబ్బందుల్ని కల్గించడమనేది అనుభవసారము.

కాని ఈ పద్యములో లౌకికస్థాయికంటె ఒక అడుగు ముందుకు వేసినందు వలననే వేమన ఆశను అన్నింటికంటె పాపిష్టిది అని చెప్పవలసి వచ్చినది. మన పురాణ కథలలో యతులు, మునులు ఆశకొద్దీ తమ తమ ఔన్నత్యాన్ని పోగొట్టుకున్న సంఘటనలు అక్కడక్కడా కన్పిస్తాయి. ఆశ జోలికి పోకూడని సర్వసంగపరిత్యాగులు దానికి చిక్కి మోసపోయిన విషయాన్ని ప్రస్తావించడం కొంత అలౌకికార్థస్ఫూర్తిని అందించడమే.

"అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః
స సన్న్యాసీ చ యోగీ చ ........"

అనికదా గీతానిర్వచనము. కర్మఫలమాశ్రయించని వాడికి ఆశ కలుగవలసిన అగత్యమే లేదు. ఆశలో మోసపోవడమంటే వారి స్థితి నుండి సామాన్యస్థితికి దిగజారడమే కదా. కాని వారంతా మానవులే కాబట్టి, కొంతమంది మానవుల మధ్య వారి ప్రవృత్తిని కొనసాగిస్తూ ఉంటారు కాబట్టి ప్రలోభపెట్టే సందర్భాలు ఎదురుకాక తప్పదు. అప్పుడే ఆత్మకు ఆ ప్రలోభాన్ని అంటించుకోకుండా చూసీ చూడనట్లు వదలి వేయగలగడమే యోగుల లక్షణం. యోగులు సాధించవలసిన లక్షణం కూడ. ఈ విషయమే భగవద్గీతలో సుస్పష్టముగా చెప్పబడినది.

**“కామేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి**
**యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే”**

కాబట్టి ఒక కర్తవ్యముగా ఇంద్రియములు తమ పనిని తాము చేస్తున్నప్పటికిని ఆ పనులపట్ల, ఆయా ప్రయోజనముల పట్ల ఎటువంటి ఆశ, అనుబంధము, ఇష్టాయిష్టములు మొదలైన భావములు లేకుండుటయే ఆత్మశుద్ధి. కాబట్టి ఆశను అంటించుకోకుండా చూసి విడిచిపెట్టే వారే శుద్ధాత్ములన్న వేమన వాక్కు గీతానుసారమే కదా చెప్పబడినది. వేమన అతి సామాన్యుడుగా ప్రజలమధ్య తిరుగుతూ, అలవోకగా పద్యరచన చేసినప్పటికిని అంతరాంతరాలలో నిండిపోయిన వివేకము, యోగ ప్రభావము ఇంతటి నిగూఢార్థాలను ఆయా పద్యాలలో చొప్పించడానికి కారణాలైనవి. ఆయన కోరికలను మొదలంట త్రుంచి, జ్ఞానమార్గాన్వేషియై జీవితాన్ని ముందుకు నడిపిన నిష్కామయోగి. భారతీయ తత్త్వసారమంతా ఆ నిష్కామయోగములోనే ఇమిడి ఉన్నది.

**ఆశచేత మనుజులాయువుగలనాళ్ళు**
**తిరుగుచుండ్రు భ్రమను ద్రిప్పలేక**
**మురికి భాండమందు ముసురు నీగలభంగి**
**విశ్వదాభిరామ వినురవేమ.**

మనుష్యులు ప్రాణమున్నంతకాలము తమ జీవితముపైనున్న ఆశతో, కోరికలతో ఈ జీవనవ్యవహారములలోనే కొట్టుమిట్టాడుతూ ఉంటారు. ఈ జీవితము బుద్బుదప్రాయమని, ఈ జన్మ, ప్రేమలు, బంధాలు అన్నీ మాయ అని వేదాంతులు, మత ప్రవక్తలు అనుభవజ్ఞులు చెప్పగా ఎప్పుడూ వినే విషయమే. అప్పుడప్పుడు శ్మశానవైరాగ్యం లాంటివి పొందటమూ సహజమే. జీవితమే శాశ్వతం కానప్పుడు ఈ తాపత్రయాలెందుకు? ఈ సిరిసంపదలు మూటగట్టుకు పోతామా” అనుకోవడమూ మామూలే. కాని ఇవేవీ మనిషిని అదుపు చేయలేవు. మరునిముషంలోనే మళ్ళీ వ్యామోహంలో పడి యథాప్రకారంగా మారటం మాత్రం నిజము. సంసారసాగరమని చెప్పటం, వినటం సాధారణమేగాని తప్పుకోవడం మాత్రం కుదరదు. ఇందుకు భిన్నంగా ఒక దశలో కోరికలను జయించి జీవిత ప్రయాణాన్ని కొనసాగించిన వేమన పై పద్యంలో అదే విషయాన్ని చాటి చెప్పాడు. మురికి కుండల దగ్గర ఈగలు ముసురుతూనే ఉంటాయి. సమస్యల వలయంలోనే సంతోషాన్ని వెతుక్కుంటూ మానవులు ఆశకొద్దీ దాని చుట్టూ తిరుగుతూనే ఉంటారు.

**నేరనన్నవాడు నెరజాణ మహిలోన**
**నేర్తునన్నవాడు నిందజెందు**
**ఊరుకున్నవాడె ఉత్తమయోగిరా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఇది లోకం తీరును, లోకుల నైజాన్ని చెప్పడమే ముఖ్యోద్దేశంగా గల పద్యమైనప్పటికి ఉత్తమయోగిని ఉదాహరణంగా చెప్పి ఉత్తమయోగికుండవలసిన లక్షణాన్ని ప్రస్తావించటం వలన ఈ సందర్భంలో గ్రహింపవలసి వచ్చినది. ఏదైనా ఒక పనికి సంబంధించి ఏమీ తెలియదు అని తప్పించుకు తిరుగువాడే ధన్యుడు. ఇది సమర్థనీయము కానప్పటికిని, ఎవరి సంగతి వారు ఆలోచించుకోవాల్సిన సందర్భంలో ఆచరణీయం. అదేవిధంగా దేనికీ స్పందించకుండా, మారు మాట్లాడకుండా ఉన్నవాడే నిజమైన తెలివిగలవాడు లోకుల దృష్టిలో. అదేవిధంగా ఆధ్యాత్మిక పరిధిలో గొప్ప యోగి.

"సర్వకర్మాణి మనసా సన్న్యస్తాస్తే" అని కదా.

**చంపదగినయట్టి శత్రువు తన చేత**
**జిక్కెనేని కీడుసేయరాదు**
**పొసగమేలు చేసి పొమ్మనుటే చాలు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

భారతీయతత్త్వమే సర్వప్రాణిసమానతాభావవిలసితము. పరిస్థితులను బట్టి బుద్ధి జీవులైన మానవులు కొన్ని కొన్నిసార్లు శత్రువులుగాను, మిత్రులుగాను పరిగణింపబడక తప్పదు. మహాకవి తిక్కన భారతములో "ఎవరు శత్రువులో ఎవరు మిత్రులో కచ్చితముగా నిర్ణయించటం సాధ్యం కాదని" చెప్పాడు. ఆ విభాగము అత్యంతక్లిష్టమని, కొన్నిసార్లు శత్రువులే సహాయకులుగా మారవచ్చునని తెలియచేశాడు. మరొక అంశమేమంటే క్షమాగుణం. అన్నింటికంటె శ్రేష్ఠమైనదిగా చెప్పబడిన మానవస్వభావమిది. సమాజ జీవితంలోగాని, రాజనీతి పరంగా గాని ఇలాంటి క్షమాగుణానికి ప్రాచీనసాహిత్యంలోనూ, పరిణత మానవ మేథోవిధానంలోను పెద్దపీట వేయబడింది. **"మిత్రులయందు, శత్రువుల యందు సమభావన గలిగి ప్రవర్తించు వాడే సర్వసంగపరిత్యాగి"** అని గీతావచనము. కాబట్టి ఆధ్యాత్మికంగా, రాజనీతిపరంగా, సామాజికంగా మనదేశీయుల ఆలోచనా విధానంలో శత్రువులను క్షమించటమనేది ఒక ముఖ్యాంశము. అదే విషయాన్ని లోకరీతిలో వేమన కూడా చెప్పాడు. చంపదగిన

శత్రువునకైనను కీడు చేయరాదని, తగు మేలుచేసి పంపివేయాలన్నది వేమన సందేశము. శత్రువులతో పెద్దకాలము కలసి ఉండుట మంచిది కాదు. మరొక అంశమేమనగా ఆ శత్రువు సంస్కారవంతుడైనప్పుడు తను చేసిన నేరాన్ని, ఎదుటివారు చేసిన ఉపకారాన్ని పదే పదే తలచుకొని, తనలోనే తానే బాధపడతాడు. అదే పెద్ద శిక్ష. తర్వాత పశ్చాత్తాపపడి, పరివర్తన పొందుతాడు. అదే అతనికిచ్చే శిక్షణ. శత్రువుగా భావింపబడినవాడు క్షేమంగా ఉన్నా, అతని లోపలి శత్రుత్వం నశిస్తుంది. భావ పరిణతి కల్గుతుంది. అటువంటి భావపరిణతి కల్గడమే సమాజశ్రేయానికి తొలిమెట్టు. కాని నేటి కాలంలో ఇందుకు భిన్నమైన వాతావరణమే అధికముగా కన్పిస్తున్నది. కలుషిత భావాలను సంస్కరించవలసిన సమయం ఇది.

**తనకు లేని నాడు దైవంబు దూరును**
**తనకు గల్గెనేని దైవమేల**
**తనకు దైవమునకు తగులాట మెట్టిదో**
**విశ్వదాభిరామ వినురవేమ.**

మానవులు అవసరాన్ని బట్టి దైవభక్తిని, దైవచింతనను ఉపయోగించుకొనే పద్ధతిని సూచన మాత్రముగా విమర్శించటం ఇక్కడ ముఖ్యాంశము. సమస్త సృష్టికి స్థితి లయ కారణముగా భగవంతుని తత్త్వాన్ని గూర్చి అధ్యాత్మవిదులు గొంతెత్తి చెప్పుతూనే ఉంటారు. ఎంతో కొంత సంప్రదాయానుసారంగా ఈ భావం పారంపర్యంగా చదువుతో, జ్ఞానంతో నిమిత్తం లేకుండానే జనం ఆలోచనలలో నాటుకుని పోయింది. అందుకే "నారు పోసినవాడు నీరు పోయడా" వంటి సామెతలు చెప్పారు. కొన్నిసార్లు మహాభక్తులు కూడా బాధలు తట్టుకోలేక "ఆ భగవంతుడేడి? ఉన్నాడా? లేడా" వంటి పదప్రయోగం చేసిన సందర్భాలు కన్పిస్తాయి. ఉదాహరణకు పోతన భాగవతంలోని గజేంద్రుని ఆవేదనా సందర్భం వంటివి. కాని ఇక్కడ భగవంతుని మీద విశ్వాసం సన్నగిల్లడం కారణం కాదు. బాధాతీవ్రత మాత్రమే కారణం. చేసిన ప్రయత్నాలన్నీ నిష్ఫలమైనందువల్ల కలిగిన నిరాశావీచిక మాత్రమే కారణం.

కాని అతి మామూలు విషయాలలో కూడ అనేక మంది వ్యక్తులు తమ ప్రయోజనాల కోసం భగవంతునిపై ఆధారపడి ఆరాధనలు చేయడం, ఫలిస్తే ఆనందించడం మామూలే. కాని తనకు అన్నీ సమకూరినప్పుడు భగవంతుని మర్చిపోవడం, తన కోరికలు నెరవేరనప్పుడు నిష్ఠురోక్తులతో దైవదూషణ చేయడం

అనేక సార్లు చేస్తూంటారు. ఇలా మంచికి, చెడుకు భగవంతుని గురించి భావించడమంటే భారం భగవంతునిదే అనుకుని మంచి చెడులు రెండింటిని సంతోషంగా అంగీకరించగలగాలి. అలా కాకుండా **"పెడితే పెళ్ళి లేకపోతే శ్రాద్ధం"** అన్న చందంగా వ్యవహరించటం సరైన విధానం కాదు. భగవంతునికి తమకు మధ్య ఎటువంటి సంబంధం ఉన్నదని వారు భావిస్తారో అంతుబట్టదు. "తగులాటము అనగా సంబంధము లేదా అనుబంధము" అనే అర్థంలోనే వాడుక. కాని కొంచెం నిష్ఠూరపు సందర్భాలలో ఈ పదప్రయోగం లోకవ్యవహారంలో కన్పిస్తుంది. తగలాటం అని అనడం కద్దు. (ఉదా॥ ఈ తగలాటం నాకెందుకు? వంటివి.) ఏదేమైనా "సుఖదుఃఖేషు సమః సంగవివర్జితః" అనే పద్ధతిలో నడుచుకోవడం అభ్యసించి సాధించాలి.

**ఎన్నిచోట్ల తిరిగి యేపాటు పడినను**
**అంటనియ్యక శని వెంట దిరుగు**
**భూమి క్రొత్తదైన భోక్తలు క్రొత్తలా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఇది కూడ ఆధ్యాత్మిక విశ్వాసములలో అంతర్భాగమే. నవగ్రహములు, గ్రహ దోషములు, గ్రహశాంతులు, ఫలితాలు మొదలైనవన్నీ శాస్త్రీయాంశములుగానే పరిగణించ బడుతున్నాయి. చేసిన కర్మఫలాలు అనుభవిస్తేనే గాని అంతరించవన్నది అనాదిగా వస్తున్న నమ్మకము. గ్రంథస్థాంశము కూడ. అదే విషయాన్ని, నమ్మకాన్ని పై పద్యంలో వేమన చెప్పాడు. చెడు కర్మల ఫలితాలు చెడ్డవిగానే ఉంటాయి. రకరకాల ఇబ్బందులను కల్గిస్తాయి. వాటిని సమర్థవంతంగా ఎదుర్కోవడమే ఆయా వ్యక్తులకు పెద్ద పరీక్ష. శిక్ష కూడ. అటువంటి ఇబ్బందులన్నీ శనిగ్రహప్రభావంవలన కలుగుతాయని జనాభిప్రాయం. వాటినుండి తప్పించుకోవడానికి ఎంత దూరం పరుగెత్తినా తప్పించుకోవడం కుదరదు. ఈ అనుభవంతోనే **"రామేశ్వరం పోయినా శనీశ్వరం పోదు"** వంటి సామెతలు వచ్చాయి. అదేవిధంగా పరమేశ్వరుడికి సంబంధించి కూడ శని ప్రభావం తప్పించుకోవడానికి చెట్టుతొఱ్ఱలో దాక్కున్నాడని ఒక కథ కూడ జన ప్రచారంలో ఉంది. కాబట్టి ఎక్కడికి వెళ్ళినా ఆ ప్రదేశం క్రొత్తదౌతుందిగాని, కర్మఫలాలను అనుభవించవలసిన వ్యక్తి మాత్రం క్రొత్తవాడు కాదు. తప్పించుకోలేడు అని వేమన అభిప్రాయం.



# వేమనశతకము - యోగరహస్యము.7

**వానరాకడయును, బ్రాణంబు పోకడ**
**కానబడదదెంత ఘనునికైన**
**గానబడిన మీద గలి యెట్లు నడుచురా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

వానరాకడ, ప్రాణం పోకడ ఎప్పుడు ఎలా జరుగుతుందో ఎవరికి ఎఱుకలేదనేది ఒక పాత సామెత. కారణం ఈ రెండుకూడ మానవప్రయత్నంతో సంబంధం లేకుండా సంభవించే అంశాలే. ప్రాచీనులు తమ అనుభవసారాన్ని సంక్షిప్తంగా సామెతల రూపంలో తరువాతి తరాలకు అందించారు. ఆధునిక విజ్ఞానం అంతగా అందుబాటులో లేని గత కాలంలో కూడ కొన్ని కొన్ని ప్రకృతి ధర్మాలు, లక్షణాలు ఆధారంగా పూర్వీకులు వానరాకడను ఊహించారు, ఉదాహరణకు శ్రీనాథుడు తన రచనలో కొన్ని కీటకాల (తూనీగలు) అత్యధిక సంచారం వానరాకడకు చిహ్నంగా చెప్పాడు. అదేవిధంగా కుక్కలు భూకంపాలను పసిగడతాయని అంటారు. ఇవన్నీ కూడ ఖచ్చితంగా నిర్ధారించగల అంశాలు కాకపోయినా అనుభవజనితాలే. ప్రాణం పోకడగురించి యోగులకేమైనా సూచనామాత్రమైన ఆలోచన ఉంటుందేమోకాని, సామాన్యులకు మాత్రం సాధ్యం కాదు. ఇది సర్వసాధారణాంశమే. ఇక కాలనిర్ణయాన్ని అనుసరించి నాల్గు యుగాలుగా విభజించి, ఆయా యుగధర్మాలను కొంత వరకు ప్రాచీన ఉపనిషత్సాహిత్యం వంటి చోట్ల క్రాంతదర్శనం కలిగిన మహానుభావులు అక్షరబద్ధం చేశారు. కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలనే నాల్గు యుగాలలో కృతయుగం సంపూర్ణ ధర్మబద్ధంగా నడిచిందని కాలక్రమంలో ధర్మప్రాధాన్యం తగ్గుతూ వచ్చి కలియుగంలో అది ఏ మారుమూలకో నెట్టి వేయబడే పరిస్థితుల్లోకి చేరిందని విజ్ఞుల అభిభాషణ. అలాంటి కలియుగంలో మహానుభావులు, సాధకులు, ధర్మపరాయణులు, యోగులు ఉండటం అనేది అరుదైన విషయం. అందుకే వేమన ఈవిధంగా చెప్పాడు. వాన రాకడ, ప్రాణం పోకడ గుర్తించగల శక్తివంతులు ఉంటే కలియుగధర్మం తలక్రిందులౌతుందనే అర్థంలో "కలి ఎలా నడుస్తుందని" పలికాడు. ఇది కలికాలం కాబట్టి అటువంటి ప్రకృతి రహస్యాలను మనోనేత్రాలతోనే దర్శించగల మహాత్ములు

లేరనేది పద్య సారాంశంగా చెప్పవచ్చును. **పదిమంది నోట జాలువారే సామాన్యవిషయాలనే, అతి నిగూఢమైన అంశాలకు జోడించి సునాయాసంగా బోధించటం వేమన ప్రత్యేకత.**

**ముచ్చుగుడికి పోయి ముడివిప్పునేగాని**
**పొసగస్వామి జూచి మ్రొక్కడతడు**
**కుక్కయిల్లు సొచ్చి కుండలు వెదుకదా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఈ పద్యంలో వ్యక్తి స్వభావాన్ని ఆశ్రయించుకునే, చేతలుంటాయని చెప్పటం ప్రధాన అభిప్రాయం. దొంగవాడు దైవదర్శనానికని గుడికి వెళ్ళి కూడ చుట్టుప్రక్కలనున్నవారు కొంగునకు కట్టుకున్న డబ్బు దస్కం గురించి ఆలోచించి, ఆ ముడివిప్పి డబ్బు కాజేసే ప్రయత్నమే చేస్తాడు. అంతేగాని దేవుని చూచి నమస్కరించడు. వాడి బుద్ధి అక్కడి దాకా వెళ్ళినాకూడ మారలేదు. కుక్క విశ్వాసము గల జంతువైనప్పటికిని ఇంట్లో ప్రవేశించినప్పుడు తిండికై వెంపర్లాడుతూ వంట పాత్రలు (కూటికుండలు ప్రాచీన ప్రయోగం) వెదుకుతుంది. అది దాని నైజం. కాబట్టి వంకర బుద్ధివాడు ఎక్కడికి పోయినా వంకరగానే ప్రవర్తిస్తాడు.

దీనిని బట్టి చూస్తే ముందు మన స్వభావాన్ని సరైన దారిలో పెట్టుకోవాలని సూచన చేయబడింది. అలా కానప్పుడు ఎంత పవిత్రమైన చోటికి వెళ్ళినా ఉపయోగం ఉండదు.

**చిప్పబడ్డస్వాతి చినుకు ముత్యంబాయె**
**నీటబడ్డచినుకు నీటగలిసె**
**బ్రాప్తికలుగుచోట ఫలమేల తప్పురా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

గ్రామీణుల జీవితాలలో జీర్ణించుకుపోయి నానుడులుగా పలుకుబడులుగా, సామెతలుగా రూపుదిద్దుకున్న జీవిత సత్యాలెన్నో ఉన్నాయి. వీటిలో కొన్ని ఆధ్యాత్మిక భావ వాసనామిళితమై సంప్రదాయ సముద్దీపితములై ఆనోటా ఆనోటా బహుళ ప్రచారాన్ని సంతరించుకున్నాయి. అటువంటి ఒక అంశమే రాసిపెట్టిందేదో రాకమానదు అనే భావంతో చెప్పే ఒక నానుడి వంటి ప్రయోగం. ఇక్కడ ఎవరికెంత ప్రాప్తమో జన్మించినపుడే నిర్ణయించ బడుతుందని ఒక విశ్వాసం కొంత మేరకు ఆధ్యాత్మిక

భావ సముల్లసితం – అంటే దేవుడే రాసి పెడతాడనే నమ్మకం. అటువంటప్పుడు మంచైనా, చెడైనా ప్రాప్తించక మానదు. అనుభవించక తప్పదు. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ వేమన ఒక అంశాన్ని దృష్టాంతంగా పేర్కొన్నాడు. సహజసిద్ధమైన ముత్యాలు వాన నీటి బొట్టు నుండి తయారౌతాయని సాహిత్యంలో పేర్కొన్నారు. సముద్రతీరాలలో ఇప్పటికి ఆలిచిప్పలు కన్పిస్తాయి. వాటిలో ఒక విధమైన పురుగులు ఉంటాయి. కాని అవే ఆలిచిప్పలు స్వాతికార్తెలో నోళ్ళు తెరచుకుని ఉన్న మాదిరి స్థితిలో సముద్రంపై తేలుతూ ఉంటాయట. ఆ సమయంలో వర్షం పడి ఏదైనా ఒక చినుకు విచ్చుకునివున్న ఆ చిప్పలో పడితే అది వెంటనే మూసుకుపోయి, కొంత కాలానికి ఆ చినుకు ముత్యంగా మారుతుంది. ఆ తరువాత ఎప్పుడో ఒడ్డుకు వచ్చిన ఆలిచిప్పలతో పాటు ఒడ్డుకు చేరుకుని ఎవరికో దొరుకుతుంది. అలా చినుకురాలని ఆలిచిప్పలు కూడ మూసుకుపోతాయి. కాని వాటిలో ముత్యాలకు బదులు ఏదో ఒక పురుగులాంటిది చోటుచేసుకుంటుంది. అందుకే ముత్యాలు సముద్రపు పంటలాంటివి. ఇప్పుడు మనం చూసే ముత్యాలన్నీ దాదాపుగా కృత్రిమంగా తయారు చేసినవే. ఆలిచిప్పలు సుమారు నలుబది సంవత్సరాల క్రితం వరకు పాత్రలను శుభ్రం చేసేందుకు పల్లెటూళ్ళలో వాడేవారు. ఇట్లా వాడబడినవన్నీ ముత్యాలను అందించడానికి నోచుకోనివే. ఇటువంటి సముద్రపు గవ్వలు, మొదలైనవి ఆధునిక కాలంలో అనేక కళాకృతులను రూపొందించడంలో ప్రధాన పాత్ర పోషిస్తున్నాయి. ఇంత చరిత్ర గలిగిన ఈ ముత్యాలు, వానచినుకులను గూర్చి కవి చెప్పి ప్రాప్తాప్రాప్తములను గురించిన అంశాన్ని దానికి జోడించి ప్రాచీనుల విశ్వాసంతో కూడిన సంప్రదాయ భావాన్ని బలంగా పాఠకులకు అందించాడు. సరైన సమయంలో సరైన ప్రదేశంలో పడ్డ చినుకు విలువైన ముత్యంగా మారింది. నీళ్ళలో పడ్డ చినుకు నీళ్ళలో కలిసిపోయింది. మనం చేసే పనులు కూడా నిర్దిష్టమైన విధానంలో సమయానుసారంగా జరిగితే సత్ఫలితాలు వస్తాయి. లేకపోతే బూడిదలో పోసిన పన్నీరు మాదిరిగా వ్యర్థమౌతాయి.

**కల్ల నిజము గరళకంఠుడెరుగు**
**నీరు పల్లమెరుగు నిజముగాను**
**తల్లి తానెరుగు తనయుని జన్మంబు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఏది నిజమో, ఏది అబద్ధమో ఆ పరమేశ్వరునికి తెలుసు. ఎటు పల్లం ఉంటే అటే ప్రవహించే లక్షణం చేత నీటికి ఎటు పల్లంగా ఉందో కచ్చితంగా తెలుస్తుంది.

అదేవిధంగా తన బిడ్డ పుట్టుపూర్వోత్తరాల గురించిన యథార్థాలు కావాలంటే తల్లికి మాత్రమే తెలుసు.

ఈ పద్యంలోని మొదటిపాదం వేమనకు భగవంతుని పైనున్న నమ్మకాన్ని స్పష్టం చేయడంతోపాటుగా, దైవ విశ్వాసం గల వేమన ప్రత్యేకంగా ఒక మతాన్నో, ఒక దేవుణ్ణి గురించో ఆరాధించే వ్యక్తి కాదని తెలియచేస్తుంది. శివుడైనా రాముడైనా వేమన దృష్టిలో ఒకటే. దైవం ఒక్కడే. అందుకే వేర్వేరు పద్యాలలో వేర్వేరు పేర్లతో దైవ ప్రస్తావన వచ్చింది. వేమన తన అభిప్రాయాన్ని ఒక పద్యంలో ఇలా చెప్పాడు. "పశువుల రంగు వేరైనా పాలు ఒక రంగులోనే ఉంటాయి. అలాగే పేర్లు, పూజలు వేరైనా భగవంతుడొక్కడే" అనేది సారాంశం. కాని ఆయా దేవుళ్ళకు సంబంధించిన పౌరాణిక సమాచార పరిచయం మాత్రము వేమనకు అధికంగానే ఉన్నది. ఈ పద్యంలో "క్షీర సముద్ర మథన వృత్తాంతాన్ని తెలియపరచే విధంగా గరళకంఠుడు అన్న పదప్రయోగం చేశాడు. అదేవిధంగా రామాయణ, భాగవత పరమైన వృత్తాంతాలకు సంబంధించిన పదప్రయోగాలు కూడ ఇతర పద్యాలలో కన్పిస్తాయి. సంపూర్ణమైన పుస్తకజ్ఞానం, లోకజ్ఞానం ఏకత్ర మూర్తీభవించిన మహానుభావుడు వేమన.

**అలను బుగ్గపుట్టినప్పుడే క్షయమౌను**
**గలనుగాంచు లక్ష్మిగనుటలేదు**
**ఇలను భోగభాగ్య మీ తీరు గాదొకో**
**విశ్వదాభిరామ వినురవేమ.**

తాను సంపాదించిన, పొందిన సిరిసంపదలు, వైభవాలు శాశ్వతమనే భ్రమలోనున్న వారిని మేల్కొలిపి, లక్ష్యం వైపు నిడిపించే ప్రయత్నమే ఈ పద్యంయొక్క ప్రయోజనం.

ఈ జీవితం, సిరిసంపదలు శాశ్వతం కావు. ఆత్మ, పరమాత్మ మాత్రమే సత్యము. శాశ్వతము. కాబట్టి క్షణ భంగురమైన లౌకిక విషయాసక్తితో జీవితాన్ని నిరుపయోగంగా మార్చుకోవద్దని, ఆత్మజ్ఞానసాధనకు ఉద్యుక్తులు కమ్మని ప్రేరేపిస్తున్న పద్యం ఇది.

నీటి ప్రవాహం పై అలలు అలలుగా నీరు కదులుతున్నప్పుడు బుడగలు వస్తాయి. అవి కొద్దిసేపటికే నీటిలో కలిసిపోతాయి. బాగా వర్షం పడుతున్నప్పుడు నేలపై ఇటువంటి దృశ్యం గోచరిస్తుంది. అంటే అది నీటిలో అంతర్భాగమే గాని

దానికి ప్రత్యేకమైన ఉనికి లేదు. వెంటనే నీటిలో కలిసిపోతుంది. మన జీవితం కూడా నీటిబుడగ వంటిదే. కొంతకాలం తరువాత అంతం కాక తప్పదు. సృష్టి, స్థితి, లయాలు మూడు ప్రకృతిలో తప్పించుకోలేని వాస్తవాలు. వాటికి కర్త ఆ భగవంతుడు లేదా పరమాత్మ. అందుకే జీవాత్మ పరమాత్మను చేరి తీరుతుంది.

కలలో లక్ష్మిని అనగా ధనము, సంపదలు ఎంత ఎక్కువ స్థాయిలో చూచి ఉబ్బి తబ్బిబ్బు అయినప్పటికి అవి యథార్థము కానందువల్ల నిద్ర మేల్కొన్న తరువాత కన్పించవు. ఈ జీవితము కూడ ఒక కలవంటిదే. శాశ్వతము కాదు. కాని భ్రమలో పెట్టి తన చుట్టూ త్రిప్పుతుంది.

ఇది గుర్తించిన మానవుడు ఈ భూమిపైన తన తాపత్రయాలు, ఆస్తిపాస్తులు, వైభవోన్నతులు మొదలైనవి కూడ పైన చెప్పిన నీటి బుడగవలెనూ, కలలో కన్పించిన లక్ష్మీవిలాసాల వలెనూ మిథ్య అని గుర్తించి తన జీవితాన్ని సరైన గమ్యం వైపు నడిపించి సార్థకం చేసుకోవాలి.



# II

## వేమన తత్త్వదర్శనము.1

**తరువ తరువ బుట్టు తరువున ననలంబు**
**తరువ తరువ బుట్టు దధిని ఘృతము**
**తరువ తరువ బుట్టు తనువున తత్వంబు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఘర్షణ (రాపిడి) ద్వారా అగ్ని పుట్టుటగురించి ప్రాచీన జీవన విధానం, ఆధునిక విజ్ఞానశాస్త్రం, మానవుని జీవనానుభవం తెలియచేస్తున్న అంశమే. యజ్ఞయాగాది క్రతువులలో జమ్మిచెట్టు చెక్కకు రాపిడి కలిగించటం ద్వారా అగ్నిని పుట్టించి హెూమ కార్యక్రమాలు ప్రారంభిస్తారు. దావానలం లేదా కార్చిచ్చు అనబడే భయంకరాగ్ని జ్వాలలు అడవులలో పడిపోయిన, ఎండిపోయిన చెట్ల మధ్య ఏర్పడ్డ రాపిడి ద్వారా పుట్టి అడవులనే దహించి వేస్తాయి. "ఏవిధంగా ఆలోచించినా చెట్టు (తరువు)కు రాపిడి కలిగించీ, కలిగించీ ప్రయత్నిస్తేనే అగ్ని పుడుతున్నది.

నెయ్యిని తయారు చేయాలంటే వెన్న విడివడి వచ్చేంతవరకు పెరుగును చిలుకవలసిందే. కోరిన ప్రయోజనం సిద్ధించే వరకు ప్రయత్నం ఆపకూడదు. మధించి, మధించి మనస్సుకు స్థిరతను సాధించి సుదీర్ఘ సాధన చేసిన తరువాత మాత్రమే తత్త్వజ్ఞానం కలుగుతుంది."

"సాధనమున పనులు సమకూరు ధరలోన" అనే మార్గమే తత్త్వజ్ఞాన సముపార్జనకు పాటించదగినది. తత్త్వజ్ఞానం, జిజ్ఞాస, సమదర్శనం వంటివి ఒక్కసారిగా వచ్చేవి కాదు. ప్రయత్నపూర్వకంగా నిరంతరం సాధన ద్వారా మాత్రమే సాధించగల అంశాలు. సాధారణ జీవన విధానం గడిపేవారికివి సాధ్యం కావని భావించాల్సిన అవసరం లేదు.

"యత్నే సిద్ధ్యతి" అనే మహాకవుల మార్గనిర్దేశం అనుసరణీయం.

**గురువు చిల్లగింజ, కుంభంబు దేహంబు**
**ఆత్మ కల్మషంబు అడుగుపట్టు**

**తెలిసినట్టి వారికి దివ్యామృతంబురా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

శరీరమనే కుండలో చేరి ఉన్న ఆత్మను అంటిన మాలిన్యము తొలగించటానికి గురూపదేశం, గురువు నుండి లభించే విషయపరిజ్ఞానం అవసరం. నీటియందున్న మురికిని తొలగించేందుకు నీరున్న కుండలో చిల్లగింజను అరగదీసి కలపటం ప్రాచీన జలవిధానాలలో ఒకటి. ఆ గింజతాలుకు ప్రభావంతో అందలి మాలిన్యం అడుగుకు చేరి, పూర్తిగా శుభ్రమైన తేటనీరు పైకి వస్తుంది. అదేవిధంగా మనసులో నున్న శారీరకమైన, సంసారపరమైన ప్రలోభాలనే మురికిని తొలగించాలంటే గురువుద్వారా లభించే జ్ఞానం ఉపయోగపడుతుంది. ఇక్కడ గురువు అంటే ఆధ్యాత్మికగురువునే ముఖ్యంగా భావించాలి.

మానవుని జ్ఞానసంపన్నుని చేయటంలో గురువుపాత్ర కీలకం. అటువంటి స్వచ్ఛ మనస్కులు, శిష్యవత్సలురు యైన గురువుల గురించి అనేక సందర్భాలలో మన సాహిత్యంలో, సమాజంలో కూడా ఎన్నో ప్రస్తావనలున్నాయి. సవ్యసాచిని కర్తవ్యోన్ముఖుడిని చేసి సర్వమానవాళికి కర్తవ్యబోధను అందించిన శ్రీకృష్ణుడు గొప్ప గురువేకదా. **"కృష్ణం వందే జగద్గురుం"** అనే ఆర్యోక్తి ఆవిర్భావానికి కారణం ఆ కర్తవ్యోన్ముఖనిర్దేశాత్మకమైన గీతా బోధనమే కదా.

**కాదని ఎవ్వరి తోడను**
**వాదులకుంబోడు వెఱ్ఱివానింబలెనే**
**భేదాభేదములెరుగడు**
**వేదాంత రహస్యమెల్ల వేమన యెరుగన్.**

ఈ పద్యము వేమన తత్త్వాన్ని, వేమన జ్ఞానాన్ని, నైజాన్ని విధానాన్ని సుస్పష్టం చేస్తున్నది. తన సిద్ధాంతాలు ఖండించినా, విమర్శించినా, ఎవరితోను వాదనలకు పోకుండ తన మార్గాన్ని తాను అనుసరించటం, చూసేవారు పిచ్చివాడుగా భావించినా పట్టించుకోకుండా, ఎలాంటి తేడాలు లేకుండా నడుచుకోవడం వేమన విధానాలుగా తెలుస్తున్నవి. ఇదే ప్రవర్తన మానవుడిని చిరస్మరణీయుణ్ణి చేసినపుడు వేమన కూడ గురుస్థానీయుడే కదా. అందుకే సామాన్యులందరికీ ఆదర్శప్రాయుడైన గురువు మహాకవి వేమన.

**చూపు వెలుగజేసి సూక్ష్మంబు లోపల**
**చిత్తమందు మోద మతము విడక**
**తుదను నెవ్వరి మతము దూషింపక పదిలుడై**
**మనము జయించువాడు ముఖ్యుడు వేమా.**

ఇక్కడ చూపు అనగా అంతర్దర్శనము. మనోనేత్రములతో చూసే చూపు మాత్రమే గాని భౌతికముగాదు. సూక్ష్మంబులోపల అంటే ఆత్మయందు అని భావించనగును. ఆత్మదీపమును వెలిగించి లేదా ఆత్మతత్త్వజ్ఞానసముపార్జన ప్రారంభించి, జ్ఞానమనెడి వెలుగును ప్రసరింపచేసి తనకానందము కలిగించు మతము లేదా సిద్ధాంతమును విడిచిపెట్టకుండా ఉండవలెను. ఇతరులెవ్వరి మతములను (అభిమతములను) ఆక్షేపించకుండా జాగ్రత్తపడాలి. ఆవిధంగా ప్రవర్తించగలిగి మనసును జయించినవాడే ప్రముఖుడు లేదా గొప్పవాడౌతాడు. ఇది వేమన జీవిత విధానము. తన మనస్సుకు నచ్చిన, తానాచరించిన సర్వశ్రేష్ఠములని భావించిన ఆలోచనా విధానాలు ఆచరణ మార్గాలు వేమన తన పద్యాల ద్వారా అనంతర తరాలకు అందించాడు. సాహిత్యప్రయోజనం సమాజ హితమే యైనప్పుడు వేమన పద్యాలలో గుదిగ్రుచ్చిన లౌకిక, అలౌకిక అంశాలన్నీ సాంఘికజీవితానికి, తాత్త్వికజీవితానికి కూడ పునాదులు వేసి గట్టిపరచి ప్రజాహితాన్ని కలిగించేవే.

"సహితస్వభావం సాహిత్యం" అనే లక్షణం వేమన సాహిత్యంలో అడుగడుగునా దర్శించవచ్చు.

**వెన్నచేతబట్టి వివరంబు దెలియక**
**ఘృతము వెదకునట్టి కూళభంగి**
**తానుదైవమయ్యు దైవాల గొల్చురా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

వెన్నముద్దను చేతిలో పెట్టుకుని నెయ్యి కొరకు వెదకులాడే వాడు మూర్ఖుడు. కారణం నెయ్యి తయారు కావడానికి మూలపదార్థం వెన్న. ఇది తెలియకపోవడం అవివేకం. అదేవిధంగా జీవాత్మరూపంలో భగవదంశ మానవునిలోనే ఉన్నది. దానిని గుర్తించి తన గురించి తాను తెలుసుకోలేని మానవుడు రకరకాల పేర్లతో దేవుళ్ళను సేవించి, ఆయా సేవలే తన దుష్కర్మ ఫలితాలను పటాపంచలు చేసి పుణ్యఫలాలందించి మోక్షదాయకా లౌతాయని భావిస్తున్నాడు. కేవల ఆర్భాటాలు కాకుండా తనలోని దైవాన్ని

గురించి తాను తెలుసుకున్న నాడే నిజమైన జ్ఞానం కలుగుతుందని, అదే మోక్షమార్గమని వేమన అభిప్రాయం. కాబట్టి మానవుడు ఎక్కడో భగవంతుడున్నాడని పరుగులు పెట్టకుండా తనలోని పరమాత్మను దర్శించాలి.

**ఎచటనుండి వచ్చు ఎచటికి జనిపోవు**
**నిదుర చంద మెరుగ నేర్చెనేని**
**ఆత్మరాకపోక అతడె పోదెలియుట**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఈ సృష్టికి భగవంతుడు కర్తయైనప్పుడు మానవుడు భూమిపై జన్మించుట, మరణించుటలకు కూడా భగవంతుడే కర్త. పుట్టినదాది ఆమరణాంతము మానవుడు తన కర్తృత్వాన్నే అంగీకరించినపుడు, పుట్టుకకు ముందు చావు తరువాత తన స్థితి ఎక్కడ, ఏమిటి అనే విషయాల గురించి ఆలోచించగలగాలి. ఇక్కడ తన స్థితి అంటే శరీరస్థితి గాదు. ప్రాణము లేదా జీవుడు లేదా ఆత్మ అనబడే దేహధారణకారకాల స్థితి. దానిని గుర్తించినవాడే నిజమైన జ్ఞాని అని సారాంశం. ఇక్కడ నిదుర అనగా శాశ్వతనిద్ర. ఆత్మ దేహం నుండి నిష్క్రమించిన స్థితి. కాబట్టి మానవుడు ఈ దిశలో ఆలోచించినప్పుడు "అహంకారం అడుగంటి" మహనీయుడైతాడు.

*సూచన : ప్రస్తుత వ్యాసాల్లోని పద్యాలన్నీ పారిస్‌ప్రతి (ఆచార్య ఎన్.గోపి సముద్ధరించినది) నుండి గ్రహింపబడినవి.*



# వేమన - తత్వదర్శనము.2

**తనదు యాత్మలోన దైవంబు నెరుగక**
**తీర్థవాసులందు తిరుగువారు**
**గంధంబు మోసిన గాడిద చందమో**
**విశ్వదాభిరామ వినురవేమ.**

భగవంతుడు తనలోనే ఉన్నాడను విషయము గుర్తించలేని వారు తీర్థయాత్రలు చేయుచూ, తైర్థికులతో కలిసి పుణ్యార్జన చేయాలను కుంటారు. కాని వారి పరిస్థితి సుగంధ ద్రవ్యమును (మంచిగంధము) మోస్తున్న గాడిద వంటిది. గంధాన్ని గాడిదపై వేసి యజమాని గాడిదచే మోయిస్తాడు. కాని గంధం పరిమళం గాడిదకేం తెలుస్తుంది. ఆత్మావలోకనం లేని వారి పరిస్థితి కూడా అట్టిదే.

**"ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।**
**ప్రసన్నచేతసో హ్యాశుబుద్ధిః పర్యవతిష్ఠతే ॥"**

ప్రసన్న చేతస్కుని యొక్క బుద్ధి శీఘ్రముగా ఆత్మరూపమైన భగవత్తత్వమున స్థిరపడునని సారాంశము. మానవుడు సాధింపవలసిన పరమార్థమిదే. ఇదే విషయము అనేక పద్యాలలో వేమన స్పష్టం చేశాడు.

**మనసులోని వాని మనసులోనె తెలిసి**
**మనసులోని వాని మస్తరించి**
**మనసు తెలియువాడు పరమయోగిరా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

"మన మనసులోనే ఉన్న భగవంతుని గుర్తించి, అధీనములోనికి తెచ్చుకొని (అనగా మనసును ఆ తత్త్వముపై లగ్నము చేసి) తన మనసు గురించిన జ్ఞానమును పొందగలిగిన వాడే శ్రేష్ఠుడైన యోగి" యోగశాస్త్ర సారమంతా క్రోడీకరించినట్లున్న ఈ పద్యమొక అనర్ఘరత్నము.

**లోనచూడ చూడ లోకాభిరామంబు**
**బయలు చూడచూడ బంధనంబు**
**తాను చూడ చూడ తారక బ్రహ్మంబు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఆత్మలోనికి తొంగి చూడగలిగినపుడు, తానెవరో తెలుసుకోగల్గినపుడు అంతా అత్యంత ఆనందసంధాయకమై మనోహరమై ఉంటుంది. కాని బాహ్యజీవితమంతా రకరకాల బాధ్యతలు, బంధాలు అనే బంధనాలతో ఇరుక్కుపోయి ఉంటుంది. ఈ బంధనాలు ఛేదించుకుని తానెవరో గుర్తించితే తానే ఈ బంధాల నుండి తరింపచేయగల పరమాత్మ సంభవుడనని, భగవదంశ అని తెలుస్తుంది.

గొప్ప ఆధ్యాత్మిక రహస్యాన్ని ఔపోసన పట్టిన నిష్కామకర్ముడు, మౌనశీలియైన యోగి కావడం వలననే ఇంత సరళాతిసరళంగా వేమన ఆత్మతత్త్వాన్ని గూర్చి వ్యక్తీకరించాడు. వేమన పద్యాలలో జీవాత్మ, పరమాత్మల అభేదాన్ని వక్కాణించే పద్యాలు అనేకం కన్పిస్తాయి. ఈ ఏకరూపతయే వేమన విశ్వాసాలలో ప్రాథమ్యం పొందిన అంశంగా చెప్పవచ్చు.

**రాతిప్రతిమదెచ్చి రాజసంబున బెట్టి**
**పూజసేయు నరుడు బుద్ధిమాలి**
**ప్రాణమందు శివుని భావింపనేరడో**
**విశ్వదాభిరామ వినురవేమ.**

వేమన విగ్రహారాధనను నిరసిస్తున్న తీరును ఈ పద్యం తెలియజేస్తున్నది. కొంచెం తీవ్రంగానే ఉందీ ఆక్షేపణ.

మానవులు బుద్ధిహీనులై రాతిబొమ్మలకు పూజలు చేస్తారు కాని ప్రాణం లేదా జీవంలో ఉన్న భగవంతుని గుర్తించలేక పోతున్నారని వేమన ఆవేదన. ప్రతి ప్రాణిలోను భగవంతుడున్నాడని గుర్తించినప్పుడు స్వపర భేదాలు, అసమానతలు, ఈర్ష్యాది అవలక్షణాలు నిరోధింపబడతాయి. మానవసేవలోనే మాధవసేవను చూడవచ్చు. మానవత్వానికి మచ్చు తునకలవంటి జాలి, దయ, సహాయతత్త్వం, సకాలంలో స్పందించటం వంటి సల్లక్షణాలు అభివృద్ధి చెందుతాయి. ఒక్కమాటలో చెప్పాలంటే చక్కటి సమాజ జీవనం శాంతి మార్గంలో శోభిల్లుతుంది. అనేక మంది సంస్కర్తల, ప్రవక్తల, విద్యావేత్తల, సమాజశ్రేయోకాంక్షుల, విశాల హృదయుల కోరిక నెరవేరుతుంది. అటువంటి సమాజం కోసం ఎవరికి వారే తమను తాము సాధనంగా చేయటం ఉత్తమ మార్గం.

**ఆశకన్న దుఃఖ మతిశయంబుగ లేదు**
**చూపు నిల్పుకున్న సుఖము లేదు**
**మనసు నిల్పుకున్న మరి ముక్తి లేదయా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

మానవుని కోరికలు, ఆశలు గానుగెద్దు మాదిరిగా మనిషినిసంసార బంధములకు పరిమితం చేసి త్రిప్పుతాయి. అది గుర్తించి, కోరికలే దుఃఖానికి కారణమని గ్రహించి, అనవసరమైన గొంతెమ్మ కోరికలకు, అత్యాశ – దురాశలకు తావు లేకుండ జీవితాన్ని గడపడమే ఉత్తమ లక్షణం. అదేవిధంగా ఆ జీవితానికి మాత్రమే పరిమితం కాకుండా జ్ఞానదృష్టితో, స్థిర చిత్తంతో మోక్ష సాధన చేయడం అత్యంతావశ్యకం. మనసు స్థిరంగా నిల్పలేనప్పుడు మోక్షగామి కాలేడు. బుద్ధుడు బోధించిన సూత్రాలలో మొదటగా చెప్పవలసింది కోరికలను అదుపుచేయడం. భగవద్గీతలో కృష్ణుని ఉ పదేశసారం కూడా ఇదే.

"ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసా ॥"

ఇంద్రియ నిగ్రహం లేకుండా ఎవరి మనస్సు ఇంద్రియముల చర్యల కనుకూలంగా వర్తిస్తుందో, వారి తెలివి, వివేకం, నీటిలోని నావను గాలి ఎలా నాశనం చేస్తుందో అలా నాశనం చేయబడతాయని శ్లోక భావం. అంటే ప్రతికూల ఫలితాలు వస్తాయి. అనుకూలంగా ఉన్నట్లనిపించి తాత్కాలికానందం కన్పించవచ్చు.

"నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।
న చాభావయుతశ్శాన్తిరశాన్తస్య కుతస్సుఖమ్ ॥"

యుక్తి (ప్రజ్ఞకావచ్చు) లేనివానికి ఆలోచనాశక్తి ఉండదు. అది లేనప్పుడు విషయానుభవము వల్ల సంతృప్తి, విముఖత కలుగవు. అట్టియెడ చిత్తశాంతి లభించదు. అశాంతునికి సుఖమెట్లు కలుగును? తాత్కాలికముగా ఆయా కోరికలను నెరవేర్చుకొనుట వలన సుఖమే కలిగినట్లు అనిపించినప్పటికిని, అది అంతరంగమును ఆనందమయము చేయజాలదు. కొత్త కొత్త బంధాలను పెంచే తాత్కాలిక సుఖము మాత్రమే. కాబట్టి ఆత్మానందమే నిజమైన, నిత్యమైన సుఖమని గుర్తింపవలెను.

"రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥"

ఈ విషయాన్ని అర్థం చేసికొని శరీరధారణ చేస్తూ, ఇన్ద్రియములను, అంతఃకరణను అధీనములో నుంచుకొని తామరాకుపై నీటిబొట్టువలె ప్రవర్తింపగలవాడె ధన్యుడు, ఇంతటి నిగూఢార్థాన్ని అంత తేలికగా చెప్పిన వేమన ఉపదేశనిపుణుడు.



# వేమన - తత్త్వదర్శనము.3

**శాంత మానసమున చల్లనై శీతల**
**భాతి నున్నవాడు పరమయోగి**
**అట్టివాడు ముక్తినతివేగమున గైకొను**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ప్రశాంతమైన మనస్సుతో చల్లనైనరీతిలో (అనగా ఆవేశము, కోపము మొదలైన లక్షణాలకు అతీతంగా) ఉన్నవాడే గొప్ప యోగి. అటువంటి వాడే మిక్కిలి త్వరగా మోక్షమును పొందగలడని పై పద్యభావము. ఇది చాల మామూలుగా కన్పించినప్పటికిని లోతైన తత్త్వరీతిని ధ్వనింప చేయుచున్నది.

*"భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృతచేతసామ్*
*వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥*

అని గీతావచనము. ప్రశాంతత అనునది సర్వవిషయపరిత్యాగబుద్ధితో వచ్చునదిగా ప్రస్తుతార్థములో గ్రహింపవలయును. అందుకు భిన్నముగా భోగములు, ఐశ్వర్యములు మొదలన వాటిని గురించిన ఆలోచనలతో, మనస్సును ఆయా విషయములకు అధీనము చేసిన వారి బుద్ధి సమాధిస్థితి యందుండనే లేదు. అనగా తత్త్వజ్ఞానము గురించిగాని, భగవంతుని గురించిగాని, మోక్షము గురించి గాని స్థిరముగా ఆలోచించలేరు. అట్టియెడ మోక్షమునొందుట యెట్లు? కావున అందుకు భిన్నముగా స్థిరచిత్తమున్నప్పుడే **"ఆనందానుభవము అలౌకికమై చిత్త శాంతి లభించును"**. ఇట్టి శాంతియే సత్యము, నిత్యము, శాశ్వతము కాగలదు. కాబట్టి అటువంటి ప్రశాంతతను పొందినప్పుడు సత్వరమే ముక్తి లభించును. అదే విషయము వేమన రచనలో సులభసుందరమైన రీతిలో స్పష్టము చేయబడి గొప్ప యోగరహస్యమై అలరారినది.

దార ధన పుత్ర యీషణ త్రయములనెడి
మోహజలరాశి లోపల మునిగి యుండు
జనులకే భంగి మోక్షంబు చెందనేర్చు
పథ్యముడుపంగ రోగము బలియు వేమ.

సంపదలు, భార్యాబిడ్డలు అనెడు మూడు రకముల కోరికలకు లోనై, ఆ కోరికలనే మోహసముద్రంలో మునిగిపోయిన మానవులకు ఏ రకముగా మోక్షము లభించగలదు. పథ్యము చేయకుండా ఇష్టానుసారము తింటూ ఉన్న రోగికి మందులు పనిచేయకపోగా రోగపు స్థాయి పెరిగి తీరుతుంది. ఆయుర్వేద వైద్యవిధానం భారతదేశంలోని అతి ప్రాచీన వైద్య విధానము. ఈ మార్గంలో రోగనివారణకు ప్రయత్నించినపుడు ఆయా జబ్బులు, శరీర లక్షణాలు, మందులు ఆధారంగా కొన్ని కొన్ని ఆహార పదార్థాలను తినకూడదు. ఆ నియమాన్ని సక్రమంగా పాటించనప్పుడు మందులవల్ల ప్రయోజనం శూన్యం.

అదేవిధంగా మనసులో పుట్టి పెరుగుతున్న కోరికలను అదుపుచేసే పద్ధతులను వదలి మనస్సును ఇష్టానుసారము వదలివేసి మోక్షం కావాలని కోరుకుంటే అది ఊహామాత్రంగా కూడా అందుబాటు లోనికి రాదు. కోరికలనే గుఱ్ఱాలకు కళ్ళెం వేసినపుడే మోక్షమార్గ గమనం సులభమౌతుంది.

*"యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతి తరిష్యతి ।*
*తదా గన్తాసి నిర్వేదం".... ....*

అనగా మోహజలరాశినుండి దూరము కాగల సాధన చేయుటయేగదా మార్గం. అనేక మంది భక్తకవులు తమ తమ రచనలలో పొందుపరచిన సారమిదే.

విత్తును నుముకయు తమలో
పొత్తుల జనియించి పెద్ద పొరలయినట్లున్
తత్త్వజ్ఞానికి కర్మము
విత్తును నుముకయు విడినటు వీడుర వేమా.

గింజ, పైపొట్టు తో కలిపి పెరిగి పెద్దదిగా మారుతుంది. ఉముక అనగా పొట్టు అని అర్థము. ఆ రెండు సంబంధము కలిగి పుడతాయి. అనగా అవినాభావ సంబంధం కలిగి ఉంటాయని చెప్పవచ్చు. అట్లే మానవుడు, కర్మబుద్ధి, కర్మాచరణ అనేవి కూడా అని ఇక్కడ అంతరార్థం. ఉపయోగించవలసిన అవసరం వచ్చినపుడు గింజ నుండి పొట్టు వేరుపడుతుంది. అదేవిధంగా తత్త్వజ్ఞానం పొందిన వ్యక్తికి కర్మబంధాల నుండి విముక్తి లభిస్తుంది. విత్తు, పొట్టు విడిపడి పోయినట్లే సాధకుడు పరిపక్వస్థాయికి చేరినపుడు కర్మబంధ విముక్తుడౌతాడని వేమన అభిప్రాయము. అతడే సన్యాసి. శరీరధారులకు సుసాధ్యము కాని స్థాయికి చేరిన పరిపూర్ణుడు.

*"నహి దేహభృతాం శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః*
*యస్తు కర్మ ఫలత్యాగీ సత్యాగీత్యభిధీయతే ॥"*

అని గీతావచనము. కర్మఫలమును త్యజించిన వాడే నిజమైన త్యాగి. దీనికి మార్గము తత్త్వజ్ఞాన సముపార్జన. ఆ జ్ఞానమునకు నిర్వచనమేమైన యున్నదా అని ఆలోచింపగా, వివిధ విషయాతీతమైన, సర్వశ్రేష్ఠమైన జ్ఞానము ఆత్మకు కర్తృత్వాది లక్షణాలు లేవని గుర్తించుటయే అన్నమాట భగవద్గీతాంతర్గతమే.

"ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని కర్మశః ।
యః పశ్యతి తథాత్మానమకర్తారం సపశ్యతి ॥"

ఇటువంటి జ్ఞానము పొందినవాడే కర్మఫలత్యాగి కాగలడు. ఇంత లోతైన విషయాన్ని గింజ పొట్టుల సంబంధంతో ఉపమించి మిక్కిలి సరళంగా చెప్పడమే వేమన ప్రత్యేకత.

గాలి లేని దివ్యకళిక చందంబున
అలలు సుళ్ళులేని అబ్ధిరీతి
నిశ్చలత్వమునను నిర్వికారంబున
నుండెనేని ముక్తి యుండు వేమ.

మోక్షగామికి కావలసినది తను సాధించవలసిన దానిపై ఏకాగ్రత. ఆ ఏకాగ్రత కుదరాలంటే మనస్సు నిశ్చలంగా ఉండటమనేది అత్యంత ప్రధానము. మనస్సు అనేది ఒక దివ్యజ్యోతి వంటిది. కాని కోరికలు సుళ్ళు తిరుగుతున్నప్పుడు, సంసార బంధాలు చుట్టుముట్టినప్పుడు దానికి నిశ్చలత ఎక్కడ ఉంటుంది? సదా గాలికి కదిలే దీపం మాదిరిగా నిలకడ లేని పరిస్థితుల్లో ఆ కాంతి మసకబారి పోతుంది. ముందు ఆ స్థితి నుండి మనస్సును రక్షించుకోవాలి. చాంచల్యానికి గురి కాకుండా చూడాలి. దానికి తొలి మెట్టు జ్ఞానార్జన.

అదేవిధంగా బహుగంభీరమైనది సముద్రం. అది ప్రశాంతంగా ఉంటే చూడ ముచ్చటగానే ఉంటుంది. దాని వలన పొందగల సహజసిద్ధమైన ప్రయోజనాలు అందుబాటులోనే ఉంటాయి. కాని ప్రకృతి ప్రతికూలతలు ఎదురైతే విలయతాండవం తప్పదు. అటువంటిదే మనస్సు కూడ. ఎన్నో ప్రాణులకు సముద్రాంతర్భాగం నిలయమైనట్లే మనస్సు ఎన్నో ఆలోచనలకు, విషయాలకు, మంచి చెడులకు నిలయం. ఎంతో గంభీరమైనది. మనకు తెలియకుండానే అంతశ్చేతనలో మూలుగుతున్న భావాలెన్నో ఉంటాయి. దానిని అదుపుచేసే మనోనిబ్బరం, మానసిక నిశ్చితి మానవుడు సాధించాలి. అప్పుడే నిర్వికారుడై ముక్తిని పొందగలడని భావం.



# వేమన - తత్త్వదర్శనము.4

**ఇంద్రియముల చేతనెగ్గొందు చుండెదు**
**వెఱ్ఱిమనుజుడెల్ల వెదకు శివుని**
**ఇంద్రియముల రోసి యీశుని జూడరా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఇంద్రియములను అదుపులో వుంచుకొనజాలని మనిషి వాటివలననే కీడును పొందుతూ, భగవంతుని వెదకుతూ ఉంటాడు. కాని ఆ ఇంద్రియములను నిగ్రహించుకొని భగవంతుని దర్శించవచ్చు. ఆ భగవంతుడు మనలోనే ఉంటాడు. **'అహం బ్రహ్మోస్మి'** అను ఆర్యోక్తిని అనుభవవేద్యం చేసికొనవచ్చు.

మనసును ఏకాగ్రం చేయటానికి తొలిమెట్టు ఇంద్రియనిగ్రహం.

"ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ ॥

ఇంద్రియాధీనము లేనప్పుడు వ్యక్తి రాగద్వేషములకు లోనౌతాడు. ఆ రాగద్వేషములే మానవుని దుష్కర్మపరుని గావించి కీడు చేస్తాయి అని పై శ్లోకభావము. వేమన పద్యములలో ఈ భావము అనేక చోట్ల ఛాయామాత్రముగ ద్యోతకమైనది.

**ఉన్నదానిని గను మూపిరి బిగబట్టి**
**కన్నుమూసియేమి కానలేవు**
**విన్నదన్నదెఱుక విజ్ఞానమనినమ్ము**
**విశ్వదాభిరామ వినురవేమ.** (విన్నది + అన్నది + ఎఱుక)

ఉన్నదానిని అనగా మనలో ఉన్న పరమాత్మ స్వరూపాన్ని అని అర్థం. ఊపిరి బిగబట్టుట అనగా గట్టి ప్రయత్నము చేసి అని చెప్పవచ్చు. ప్రయత్నించి మనలోనే ఉన్న భగవంతుణ్ణి చూడాలికాని, కళ్ళు మూసుకుని కూర్చుంటే ప్రయోజనం ఉండదు. విన్నది, చెప్పినది, తెలుసుకున్నదే జ్ఞానము. కాబట్టి అట్టి జ్ఞానాన్ని నమ్మి, దానిని ఆధారం చేసుకుని ఆత్మదర్శనం చేయవచ్చునని వేమన ఉద్ఘాటించాడు.

"విన్నంత, కన్నంత, తెలియవచ్చినంత" తేట పరతునన్న పోతన ఆలోచనా విధానమే ఇక్కడ ఉన్నది. "జ్ఞానం, జ్ఞేయం, జ్ఞానగమ్యం హృది సర్వస్యవిష్ఠితమ్" అను శ్లోకభాగము ద్వారా తెలియదగిన విషయము మనస్సులో నున్నదానిని తెలిసికొనుటకు మనోనేత్రములే ఆధారమని.

**జాతినీతి వేఱు జన్మంబదొక్కటె**
**అరయఁదిండ్లు వేఱె యౌనుగాక**
**దర్శనములు వేఱు దైవమొ నొక్కటె**
**విశ్వదాభిరామ వినురవేమ.**

సమాజంలో కులాలు, ఆలోచనలు, ధర్మాలు, తిండి తినే విధానాలు, ఆచార వ్యవహారాలు తలకొక్క రకంగా ఉండవచ్చును. అనగా సామాజిక వర్గీకరణలు, కులమతాలు, వృత్తులు మొదలైనవి వ్యక్తులమధ్య విభిన్నంగా ఉండటం వల్ల వేర్వేరు వర్గాలు ఉన్నాయి. కాని అందరి జన్మా ఒక్కటే. అంటే మానవులందరూ ఒక్కటే. అదే విధంగా దేవుని వేర్వేరు పేర్లతో రూపాలతో దర్శించవచ్చు. కాని భగవంతుడొక్కడే అని వేమన అభిప్రాయము. భగవంతుడొక్కడే అని నమ్మటంతో పాటు మనుషులంతా ఒక్కటేనని చాటిన సమానత్వవాది, మానవత్వ ప్రచారకుడు యైన వేమన ప్రజాకవి.

**ఆకు వక్క సున్నమది మూడు వన్నెలు**
**నేకమైన చోట దాకునెఱుపు**
**సోకి త్రిగుణమట్లు పరమాత్మ రూపమ్ము**
**విశ్వదాభిరామ వినురవేమ.**

మానవునియందుండు త్రిగుణములు అనగా సత్త్వరజస్తమో గుణములు ఏకత్ర ఉన్నచోట పరమాత్మ స్వరూపం ఉంటుంది. స్వరూపం అంటే ఆకారం కాదు. లక్షణం లేదా తత్త్వమని భావించాలి.

"త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శరణు"

అని గీతావచనము. ఈ మూడు విధములు మూడు వేర్వేరు మార్గానుసారులుగా చెప్పబడినవి. కాని ఈ మూడులక్షణాలు మానవ సహజములు కావడం వలననేమో వేమన ఈ విధంగా పరమాత్మ గురించి ప్రత్యేకాభిప్రాయం చెప్పాడు.

**జననమరణములకు సర్వస్వతంత్రుడె**
**మొదట గర్తకాదు, తుదను కాదు**
**నడుమ గర్తననుట నగుబాటు కాదొకొ**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఏ వ్యక్తికూడ పుట్టుక చావు అను విషయములకు తాను కర్తకాడు. తనకు నచ్చిన విధముగా జీవితారంభాన్ని, అంతాన్ని నిర్ణయించుకునే శక్తి ఎవరికిని లేదు. మానవుని తాపత్రయాలు, తెలివితేటలు మొదలైనవన్నీ బ్రతికి యున్నంత వరకే పరిమితము. అట్టియెడ సృష్టి, లయములకు కర్త కానివాడు మధ్యస్థితికి తానే కారణమని, తనకు కలిగిన సంపదలు, విజయాలు మొదలైన వాటికి తానే కారణమని భావించుట అయుక్తము. కేవల అహంకార జనితము.

అందుకే వేమన ఇలా అంటాడు. "మధ్యలో నేనే కర్తనని అనుకోవడం హాస్యాస్పదం కదా" అని.

"జాయతే మరణాయైవ, మ్రియతే జన్మనే పునః
జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ"

చావుపుట్టుకకు, పుట్టుక చావుకు కారణభూతాలు. పుట్టిన వారికి గిట్టుట తప్పదు. మరణించిన వారికి మరల జన్మించక తప్పదు. ఇట్టియెడ కాలచక్రములో ఈ జీవన పరిణామములు ఎవరిచేతిలోనూ లేని అత్యంత సహజవిషయాలు.



# వేమన - తత్వదర్శనము.5

**వ్రాత వెంటగాని వరమీదుదైవంబు**
**సేతకొలదిగాని వ్రాతకాదు**
**వ్రాతకజుడుకర్త, సేతకుతాకర్త**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఈ పద్యంలో లోకుల మాటలలో విన్పించే విషయం, ఒక విశ్వాసం ప్రస్తావనకు వచ్చాయి. అదే 'తలరాత' లేదా 'బ్రహ్మరాత' (వ్రాత) అనేది. పుట్టినప్పుడే సృష్టికర్త ఆ జీవి జీవనమార్గాన్ని, ప్రాప్తాప్రాప్తాలను నిర్దేశిస్తాడని, ముందుగానే ఆ విషయాన్ని వ్రాసి మరీ పంపిస్తాడని ఒక వాడుక. జనశ్రుతి. దీని నుండి వచ్చిందే "ఎలా రాసి ఉంటే అలా జరుగుతుంది" అనే అభిభాషణ.

"లలాటలిఖిత రేఖను మార్చటం బ్రహ్మాదులకు సైతం సాధ్యం కాదని" ఒక సంస్కృత శ్లోకం కూడా చెప్తున్నది.

"బ్రహ్మణాపి.... .... .... లలాటలిఖితరేఖాం పరిమాష్టుం న శక్యతే" సృష్టికర్త కూడ మార్చలేడన్నమాట. కాని ఈ నిర్ణయం కొందరికి అనుకూలంగాను, మరికొందరికి ఇబ్బందికరంగాను ఎందుకు జరుగుతుంది? ఇందుకు అనేకానేక సమాధానాలు అందుబాటులోనే ఉన్నాయి. **"చేసుకున్నవాడికి చేసుకున్నంత"** అనేది ఒక సామెత. చేసిన కర్మల ఫలితమే, పాపపుణ్యాల సారమే జీవితంలోని ఒడిదుడుకులకు, సుఖదుఃఖాలకు కారణమని దీనికి అర్థం. ఇదంతా భారతీయుల విశ్వాసాలకు, తాత్త్వికజీవితానికి సారంగా సామాన్యులలో చోటుచేసికొన్న భావజాలమే. ఈవిధంగా ఆలోచిస్తే జనజీవితంలోని అనేక పార్శ్వాలను మనం దర్శించవచ్చు. వేమన కూడా ఈ విషయంలో జనాభిప్రాయాన్నే సమర్థించాడు. కర్మభూమిలో పుట్టిన కర్మసిద్ధాంతసారం ఇదే కదా. దైవానుగ్రహం మన ముఖాన వ్రాసిన వ్రాతమీద ఆధారపడి ఉంటుందట. కాని ఆ వ్రాతమాత్రం మన చేతల మీద ఆధారపడుతుంది. ఆ వ్రాతకు బ్రహ్మదేవుడు కర్తయైతే, అందుకు కారణమైన చేతలకు మాత్రం ఎవరికి వారే కర్తలు. అనగా మానవుడే కర్త. అనగా సత్కర్మాచరణయే సత్ఫలితాల నిస్తుందని తాత్పర్యం.

ప్రతి ఒక్కరు తమ ఆలోచనలతో మంచి చెడులను నిర్ణయించుకుని మంచి పనులు చేసి, మంచి జీవితాలను గడపాలని వేమన సందేశం. స్వార్థం, పరార్థం రెండూ సాధించాలి. తనకు మేలు జరగడంతోపాటు తోటి వారికి మంచి జరగాలని కోరుకోవాలి. ఆ మార్గంలో పయనించాలి. ఆధ్యాత్మిక ప్రయోజనాలతో పాటు సామాజిక ప్రయోజనాలు కూడా సాధించాలి.

**కుండ కుంభమన్న కొండ పర్వతమన్న**
**ఉప్పు లవణమన్న ఒకటిగాదె**
**భాషలింతె వేరు పరతత్త్వమొక్కటే**
**విశ్వదాభిరామ వినురవేమ.**

"కుండకు మరొక పేరు కుంభము. కొండకు వేరొక పేరు పర్వతము. ఉప్పును లవణమని కూడ అంటారు. ఏ పేరుతో పిలిచినప్పటికి వస్తువు మాత్రము ఒక్కటే. అదేవిధంగా భగవంతునికి అనేకమైన పేర్లు ఉన్నాయి. వేర్వేరు భాషలలో వేర్వేరుగా పిలుస్తారు. ప్రాంతాలు మారినా, పేర్లు మారినా, భాషలు మారినా ఆరాధ్యుడైన భగవంతుడు మాత్రం ఒక్కడే."

ఇది చాల ప్రాశస్త్యమున్న విషయం. భగవంతుని పూజావిధానాలు మొదలైనవి ఆధారంగాను, ఇంకా వివిధ కారణాల వలనను అనేక మతాలు ఈ భూమిపై ఏర్పడ్డాయి. వివిధ మతాలలో వేర్వేరుగా ఆ అలౌకిక తత్త్వాన్ని గురించి ఆలోచించడం, ఆరాధించడం, ప్రార్థించడం వంటి విధానాలు ఉన్నాయి. కాని పేరేదైనా, విధానమేదైనా లక్ష్యం ఒక్కటే. మోక్షప్రాప్తి. దీనికి కూడా పేర్లు వేరుగానే ఉండవచ్చు. ఒక్కమాటలో చెప్పాలంటే ఆ భగవంతుని అనుగ్రహం పొందటం. ఆ భగవంతుని ఆకారం, నివాసం లాంటి అంశాల గురించిన లోతైన అధ్యయనాల సారాంశం ఏమంటే భగవంతుడు నిరాకారుడు, నిర్గుణుడు, నిర్వికారుడు, సచ్చిదానంద స్వరూపుడు. అటువంటప్పుడు ఈ పేర్లు ఈ విధానాలు ఏమిటి? ఎందుకు? అన్నది ప్రశ్న. ఇవన్నీ మానవుడు తన సాధనకు ఏర్పాటు చేసుకున్న విధానాలు. అనంతమైన మానవ జీవన ప్రయాణంలో ఏర్పరచుకున్న అనేక మార్గాలు. సామాన్యస్థాయిలో చేయగల్గిన, ఆచరించగల్గిన పద్ధతుల నిర్దేశంలో ఏర్పడిన వ్యవస్థితాంశాలు. ఇంత తేలికైన అంశానికి ఇన్ని మతగ్రంథాలు, ఇన్ని పురాణాలు, ఇతరేతర సిద్ధాంతాలు అవసరమా? ఇవన్నీ కూడ మానవ మేధోపరిణామంలో, పరిపక్వతలో, పాండితీగరిమలో, భగవత్తత్త్వాన్వేషణలో, జిజ్ఞాసలో,

మోక్షేచ్ఛలో ఆవిర్భవించినవే. (ఈ మాట చెప్పడం సాహసోపేతమే కావచ్చు. కొన్నిసార్లు అజ్ఞానజనితంగాను అన్పించవచ్చు. ఇది ఒక ఆలోచన మాత్రమే. అభిప్రాయం మాత్రమే.) ఏదేమైనా భగవంతుడు ఒక్కడే అన్నది సారాంశం. మరి వేమనకు పూర్వం మతఘర్షణలు జరిగినవి. శైవ, వైష్ణవ భేదాలతో అవి వేమన జీవించిన సమాజంలోనే చోటు చేసికొన్నాయి. అంతకు ముందు హిందూ, మహమ్మదీయ మతాలు, పరిణామాలకు సంబంధించి ఆయా చరిత్రలో ఎన్నో విషయాలు చెప్పబడ్డాయి. అప్పటి నుండి ఇప్పటివరకు ఈ మత సిద్ధాంతాలపరమైన సమస్యలు ఎన్నోరకాలుగా సమాజంలో చోటుచేసుకుంటూనే ఉన్న విషయం అందరికీ తెలిసిందే. భగవంతుని పేరున, మతం చాటున మానవులు ఘర్షణలకు, దాడులకు దారితీసే పరిస్థితులు సృష్టించటం ఎందుకు జరుగుతుంది? "భగవంతుడొక్కడే, ఈ మార్గాలన్నీ ఆ భగవంతుడిని చేరుకునే వివిధ దారులే" అని తెలియలేకనే కదా. తెలిసినా ఆ మార్గాన్ని అనుసరించే స్థాయికి మనస్సును తీసుకు రాలేకనే కదా "దేవుడు, మతం" అనేవి మన మంచికే ఉపయోగించాలి తప్ప వైరుధ్యాలకు వైషమ్యాలకు కాదు.

**పెక్కు చదువులేల, తర్కవాదములేల**
**ఒక్కమనసుతోడ ఊరకున్న**
**సర్వసిద్ధుడగును, సర్వంబు తానౌను**
**విశ్వదాభిరామ వినురవేమ.**

భగవంతుని పట్ల భక్తి విశ్వాసాలను కల్గి ఉండటానికి అనేక గ్రంథాలు చదవాల్సిన అవసరం గాని, అనేక సిద్ధాంతాలను ఆసాంతం అవలోకనం చేయాల్సిన అవసరం గాని, తర్క వితర్కాలు గాని అవసరం లేదు. "ఒక్క మనస్సు కల్గి ఉండాలి". అంటే ఒకేవిధమైన నమ్మకంతో, దృఢమైన అభిప్రాయం కలిగి ఉంటే చాలు. ఆ స్థిరమైన భావమే సమస్త సిద్ధులను కల్గిస్తుంది. అట్టి నిశ్చల తత్త్వమే సమస్తము అవుతుంది. కాబట్టి ఆ దైవశక్తి పట్ల, దైవ తత్త్వము పట్ల అచంచల విశ్వాసాన్ని కల్గి ఉండే స్థాయికి ఎదిగి, స్థిరచిత్తుడై ఉండటమే గొప్ప భక్తి. గొప్ప యోగము. గొప్ప సిద్ధి. "మన్మనాభవ" అన్న గీతోపదేశమే పరోక్షముగా ఇక్కడ అన్వయింపబడుచున్నది.



# వేమన - తత్వదర్శనము.6

**తరువ తరువ బుట్టు తరువున ననలంబు**
**తరువ తరువ బుట్టు దధిని ఘృతము**
**తరువ తరువ బుట్టు తనువున తత్త్వంబు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

సాధకునికి నిర్విరామమైన సాధన అవసరమని చెప్పుటయే ఈ పద్య సారాంశము. అటువంటి సాధన కొనసాగించినప్పుడే ఇంద్రియములు అధీనములోనికి వచ్చి, ఏకాగ్రత కుదిరి, లక్ష్యం సిద్ధిస్తుంది.

ప్రాచీనులు రాపిడి (ఘర్షణ) ద్వారా అగ్నిని పుట్టించి తమ అవసరాలు తీర్చుకునేవారు. ప్రకృతి సిద్ధమైన విధానం ఇదే. అడవులలో చెట్ల మధ్య ఏర్పడే రాపిడివల్ల కలిగిన అగ్నియే కార్చిచ్చుగా మారుతుంది. ఆధునిక కాలంలో కూడా యజ్ఞాదికముల నిర్వహణలో అగ్నిని రాపిడి ద్వారానే పుట్టిస్తారు.

అదేవిధంగా నిత్యం అనుభవంలోకి వచ్చే విషయం ఏమంటే – పెరుగును బాగా చిలికినప్పుడే వెన్న, దాని నుండి నెయ్యి లభిస్తాయి. ఈ రెండు విషయాలలో లౌకికావసరాలు నేరవేరుతున్నాయి.

అలౌకికమైన ఆత్మానుభూతి, జ్ఞానసంపద కూడా ఇటువలెనే పట్టుదలతో సాధించి నపుడే లభిస్తాయి. “సాధనమున పనులు సమకూరు ధరలోన” అనే మాట అందరెరిగినదే కదా.

“యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్ ।
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్ ॥ అని

గీతాకారుని సందేశము. చంచలమైన మనస్సును ముందుగా అధీనము చేసికొని ఆ తరువాత మాత్రమే ఆత్మసాక్షాత్కారము పొందనగును. కావున సాధకుడీ విషయాన్ని గ్రహించి సాధన ప్రారంభించాలి.

**ఎచటినుండి వచ్చు ఎచటికి జనిపోవు**
**నిదుర చందమెరుగ నేర్చెనేని**

**ఆత్మరాక పోక అతడెపోదెలియుట**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఆత్మ శాశ్వతము. జరామరణములు లేనిది. పునర్జన్మ సిద్ధాంతము ననుసరించి వేర్వేరు శరీరముల ద్వారా మరల మరల ప్రాణుల రూపంలో ఉద్భవిస్తుంది. ఈ సిద్ధాంతాన్ని విశ్వసించినపుడు, ఒక శరీరమును వదలి వేరొక శరీరములోనికి ప్రవేశించే విధానంలో ఈ ఆత్మ ప్రయాణం ఎలా సాగుతుంది అని అనుమానం రావడం అత్యంత సహజం.

"వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ"

చిరిగిన వస్త్రములను వదలి క్రొత్త వస్త్రములను ధరించుట ఎంత సహజమో ఒక నిరుపయోగ స్థితికి చేరిన శరీరాన్ని వదలి వేరే శరీరములను ఆత్మ ఆశ్రయించుట అంతే సహజముగా భావింపనగును. అనగా ఎడతెగక సాగు ప్రక్రియయే ఇది. జనన మరణములు ఒకదాని వెనుక ఒకటి సంభవిస్తూనే ఉంటాయి.

ఈ విషయాన్ని గ్రహించటానికి వేమన చెప్పిన సులభోపాయం నిద్ర గురించి తెలుసుకోవడము. నిదురలో ఉన్నప్పుడు ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు? మెలకువ వచ్చిన తరువాత అంతా మామూలే. ఈ రెంటికి మధ్యనున్న రహస్యాన్ని, సమన్వయాన్ని ఎంత వరకు తెలిసికొనగలము? కాబట్టి బ్రతికి ఉన్నప్పటిది తాత్కాలిక నిద్రయైతే మరణమన్నది ఆ శరీరానికి శాశ్వత నిద్ర. ఆ నిద్ర గురించి తెలిస్తే ఆత్మ గమనం గురించి కూడా తెలుసుకోగలమన్నది వేమన అభిప్రాయము.

**చూపు వెలుగు జేసి సూక్ష్మంబు లోపల**
**చిత్తమందు మోదమతము విడక**
**తుదను నెవ్వరి మతము దూషింపక పదిలుడై**
**మనము జయించువాడు ముఖ్యుడు వేమా!**

వేమన పై పద్యంలో చిత్తములో సంతోషాన్ని అనుభవిస్తూ ఉండాలని ప్రాథమిక సూత్రం చెప్పాడు. ఈ సంతోషం వస్తుమయ ప్రపంచంలో తనదిగా భావిస్తున్న సంపదలు మొదలైన వాటి వల్ల లభించే లౌకిక ఆనందమా, లేక ఆత్మానందమా అన్నది తేల్చుకోవాల్సిన అంశం. వ్యక్తిత్వ వికాస నిపుణులు అడుగడుగునా అనుకూల భావాలు, ఆలోచనలు వ్యక్తి ఎదుగుదలకు, విజయాలకు ఎంత అవసరమో ఈనాడు

అదేపనిగా చెప్పటం అందరికీ తెలిసిందే. ఈ అంశం చెప్పే పద్ధతిలో క్రొత్తగా కన్పించినా ఆలోచన అనాదిగా ఉన్నదే కదా. ఏది సాధించాలన్నా నిరాశా, నిస్పృహలు తొలి శత్రువు లౌతాయి. అందుకే వాటిని దూరంగానే ఉంచి మానవుడు తన ప్రయత్నం తాను చేయాలి. అది లౌకిక జీవితానికి సంబంధించిన ప్రయత్నమైనా, పారమార్థిక జీవితానికి చెందిన అంశమైనా ఒకటే. తొలిమెట్టు మనసును అనుకూలంగా, శాంతంగా, సంతోషంగా ఉంచగలగడం, ఇటువంటి సూత్రాలు భగవద్గీత నుండి ఆధునిక శతకాల దాకా అంతర్గతంగా ఇమిడి ఉన్నాయి. అటువంటి ఒక సూత్రమే ఇక్కడ కూడా అంతర్లీనంగా ఉన్నది.

శరీరాన్ని స్థూల, సూక్ష్మశరీరాలుగా వేదాంతులు, అధ్యాత్మవేత్తలు చెపుతూ ఉంటారు. సరళమైన పద్ధతిలో చెప్పాలంటే పైకి కన్పించే శరీరాకృతితో కూడిన స్థూల శరీరం, కన్పించకుండా ఈ శరీరానికి చైతన్యాన్ని, తేజస్సును, బుద్ధిశక్తిని అందించే తత్త్వం లేదా ఆత్మశక్తిని సూక్ష్మ శరీరంగా చెప్పవచ్చు. జీవాత్మగా భావించవచ్చు.

మానవుడు తన దృష్టిని బాహిరమైన ప్రాపంచిక విషయాలపైన కేంద్రీకరించటం అనేది సమాజంలో తను కొనసాగించే జీవితాన్ని పండించుకునేందుకు ఉపయోగిస్తుంది. దీనిని సాగిస్తూనే సాధించవలసిన ఆత్మజ్ఞానం మరొకటి. ఈ రెండవ దానిని పొందటానికి "చూపును సూక్ష్మంబు లోపల వెలుగు చేయాలట." అంటే అంతర్దృష్టిని లేదా మనోనేత్రాలను తన తెలివితేటలతో తేజోవంతంగా చేసి సూక్ష్మ శరీరాన్ని లేదా ఆత్మను, భగవంతుని గురించి ఆలోచించాలన్నమాట. ఈ క్రమంలో మానవుడు చికాకు, కోపం లాంటి ప్రతికూల భావాలను మనసంతా నింపుకొనకూడదు. అంతేకాదు సామాజికముగాను, ఆంతరంగికముగాను కూడా ఇతర మతములను దూషించకూడదని వేమన మతము. భగవంతుడు ఒక్కడే అని నమ్మిన వేమన ఇంతకంటె భిన్నంగా ఎందుకు చెపుతాడు? అదే వేమన తత్త్వం. అటువంటి సహనంతో సంతోషంతో, ఆత్మశక్తిని ప్రేరేపించి తన మనసును జయించిన వాడే ముఖ్యుడు అని వేమన అభిప్రాయం. ఇంత లోతైన పరిజ్ఞానం కలవాడు కాబట్టే వేమన ప్రతివిషయాన్ని తన చిన్న చిన్న పద్యాలలో ఇమిడించి అనంతర తరాలకు ఐహికాముష్మిక బోధ చేశాడు.



# వేమన - తత్త్వదర్శనము.7

**సూక్ష్మరూపమెరిగి సుఖమనుభవింపగ**
**బహుశాస్త్రములు చదివి పడును నరుడు**
**చావు పుట్టెటుగని చదువది యేలరా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఆత్మజ్ఞానమును పొందగోరిన మానవులు దానిగురించిన పరిజ్ఞానమునకై అనేక శాస్త్రములు చదువుతారు. నిజానికి ఏ శాస్త్రం చదివినా జీవిత రహస్యాన్ని తెలియలేనప్పుడు ఆ శాస్త్ర పాండిత్యమంతా వ్యర్థమే. చావు, పుట్టుకల గురించి తెలియచెప్పలేని చదువులు ఎంత చదివినా ఉపయోగం ఉండదు. కాబట్టి పాండిత్య ప్రకర్షకంటే విషయాన్ని గూర్చి సూటిగా చెప్పగలిగిన విషయాలు తెలుసుకోవడం ముఖ్యం. అనవసరపు సిద్ధాంతాలు, రాద్ధాంతాలకు వేమన ప్రాముఖ్యం ఇవ్వడు. ఇది ఆయన మనసులోనున్న విధాన ప్రాతిపదిక.

**లోని చూపు చూపులో జూడజూడంగ**
**వెలుగులోని వెలుగు వెలుగు చుండు**
**పలుకులోని పలుకు పలికింప తత్త్వమౌ**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అంతర్దృష్టితో మనలోనే ఉన్న తేజోరూపమైన ఆత్మను గురించి ఆలోచించి, చూడగా చూడగా ఆ ఆత్మ జ్యోతిరూపంలో ఉన్న తత్త్వం అర్థమౌతుంది. మనమాటలలోనే అది ఇమిడి ఉంది, ఆ జ్ఞానం ప్రస్ఫుటంగా వ్యక్తమౌతుంది. అదే తత్త్వదర్శనం. ఆ తత్త్వాన్ని గురించిన బోధ కూడ మనం మనలోనికి చూడగల్గినప్పుడే మనకు ఆత్మతత్త్వం తెలిసి మన మాటల ద్వారా ఆ తత్త్వాన్ని వివరించగలమని భావించవచ్చు.

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం, తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।
ఏతద్ జ్ఞానమితి ప్రోక్తం, అజ్ఞానం యదతోఽన్యథా ॥

భగవద్గీతయందలి ఈ శ్లోకార్థము నిత్యమైన అధ్యాత్మజ్ఞానము, తత్త్వజ్ఞానదర్శనములు నిజమైన జ్ఞానమని, మిగిలినది అజ్ఞానమని. పైన చెప్పిన పద్యములలో వేమన చెప్పిన తత్త్వము కూడా ఇట్టిదే.

**ప్రియములేని విందు పిండి వంటల చేటు**
**భక్తిలేని పూజ పత్రిచేటు**
**పాత్రయెఱుగ నీవి బంగారు చేటయా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఈ పద్యంలో అతి మామూలు సామాజికాంశాలతో పాటుగా భక్తి ప్రాధాన్యాన్ని ప్రస్తావించటం జరిగింది. వేమన మనసులో విశిష్ట స్థానాన్ని ఆక్రమించిన భక్తి, ఆత్మజ్ఞానం, చిత్తశుద్ధి ఇత్యాది అంశాలు మామూలు మాటలలో గూఢ దొర్లి, ఆయన ఆలోచనలకు పట్టం గడుతున్నాయి.

ఇతరులకు మనం ఏదైనా పెట్టదలచినప్పుడు మనసారా, ప్రేమతో పెట్టగలగాలి. అంతేగాని ఆర్భాటంతో అధికస్థాయిలో రాశి, వాసి ముఖ్యంగా భావించి మాత్రం కాదు. ఒకవేళ అలా భావిస్తే అది ఆడంబరమౌతుంది. వారి వారి స్థాయిని ప్రదర్శించే వేదికగా మారుతుంది. కాబట్టి ఏది పెట్టినా, ఎంత పెట్టినా ప్రేమ, ఆత్మీయతలు ముఖ్యం. అవి కొండంత సంతృప్తిని, ఆనందాన్ని మిగులుస్తాయి. అలా కానప్పుడు ఆ విందు పిండివంటలు దండగ చేయడానికే అవుతుంది.

అదేవిధంగా పూజకు వస్తుసామగ్రి కంటే మనసు ముఖ్యం. అదొక కర్తవ్యం, విధి అన్న మాదిరిగా కాకుండా, నిండైన భక్తితో చేసినప్పుడే ఫలితం లభిస్తుంది. అలా గాకుండా భక్తి స్థానంలో వేరే ప్రయోజనాలు నింపుకొని కొండంత పత్రితో, పూలరాశులతో పూజించినా ఫలితం సున్న. కాబట్టి పూజచేసే విధానం మన భక్తికి ప్రతిబింబం కావాలి గాని, అట్టహాసాలకు గాదు.

ఇక దాన ధర్మాల విషయానికి వస్తే అర్హత గలవారికి, సద్వినియోగం చేసే వారికి మాత్రమే దానం చేయాలి. **“పాత్రనెఱిగి దానం, క్షేత్రమెరిగి విత్తనం”** అన్న నానుడి ఊరికే రాలేదు. చేసినపని సద్వినియోగం అయ్యితీరాలన్నదే దీన్లోని అభిప్రాయం.

ఈ విధంగా వేమన విందు, దానం, పూజ ఈ మూడింటిని ఒకే పద్యంలోకి చేర్చి, వాటి వెనుక ఉండవలసిన మనస్సుకు ప్రాధాన్యం ఇవ్వాలని చెప్పాడు. **“యో మద్భక్తస్స మే ప్రియః”** అనేది అందరికి తెలిసిన విషయమే.

**దేవపూజ చేయ దివ్యభోగము గల్గు**
**తత్త్వమెఱిగెనేని దైవమగును**

**ఏమెఱుగని నరుడు యేగతి జెందునో**
**విశ్వదాభిరామ వినురవేమ.**

పూజాదికాలు, తత్త్వవివేచన – వాటి ప్రయోజనములు పైవిధంగా చెప్పిన వేమన ఏమీ తెలియని నరుని గురించి కొంచెం జాలిగా, కొంచెం నిష్ఠూరంగా చెప్పిన తీరు ఈ పద్యంలో గోచరిస్తుంది. దానితోపాటు మనలోనే భగవంతుడున్నాడనే ఆధ్యాత్మికాంశాన్ని మరొక్కమారు గుర్తుచేస్తున్నది.

ఈవిధంగా తన పద్యాలలో అనేక సందర్భాలలో భగవత్తత్త్వాన్ని, ఆత్మతత్త్వాన్ని, భక్తితత్త్వాన్ని, మనోతత్త్వాన్ని ప్రకాశింపచేసిన వేమన తన తత్త్వం గురించే తానే తెలియచెప్పిన పద్యం ఒకటి పారసీ ప్రతిలో ఉన్నది. అదే ఈ క్రింది పద్యం –

**కాదని ఎవ్వరి తోడను**
**వాదులకుంబోడు వెఱ్ఱివానికివోలెన్**
**భేదాభేదము లెఱుగడు**
**వేదాంతరహస్యమెల్ల వేమన యెఱుగున్.**

మన సిద్ధాంతాలు మొదలైన విషయాలలో వాదనలు చేయడం వేమనకు అయిష్టం. ఇంకా చెప్పాలంటే పిచ్చితనం. అందుకే వాదాలకు దిగకుండా తనపని తాను చేసుకుపోవడమే లక్ష్యంగా తన రచనా ప్రయాణం కొనసాగించాడు. ఎలాంటి భేదబుద్ధి లేని వేమనకు వేదాంత రహస్యాలన్నీ తెలుసని నిజాన్ని ఒక్కమాటలో తేల్చేశాడు. ఇదే వేమన అసలు తత్త్వం నైజం. జ్ఞానం, స్ఫూర్తి, అభిమతం అని స్పష్టం. వేమనను మనకు పూర్తిగా యోగిగా చూపించగల రచన పారిసీ ప్రతిలోనే మరొకటి కన్పిస్తున్నది.

**వేదాతీతుడు వేమనరా, వేమన మాటలు వేదమురా**
**విసువక చదివితె కందురురా, కన్నవారు మరిచెప్పరురా**
**కొమ్మలమీదనె పందిరిరా, పందిరికిందనె చుక్కలురా**
**చుక్కల క్రిందను చంద్రుడురా....**



# వేమన - తత్వదర్శనము.8

**కనగ సొమ్ములెన్నొ కనకంబదొక్కటి**
**పసుల వన్నెలెన్నొ పాలొకటియె**
**పుష్పజాతులెన్నొ పూజయొక్కటె సుమీ**
**విశ్వదాభిరామ వినురవేమ.**

పై పద్యంలో భగవంతుని ప్రస్తావనగాని, జ్ఞానసంపదయొక్క ప్రస్తావన గాని ఏమాత్రము లేదు. కాని ప్రసక్తానుప్రసక్తముగా, అంతర్లీనముగా చెప్పిన విషయాలు మాత్రము భగవత్తత్త్వనిర్ధారణ, సాధన, మార్గవివరణ – ప్రయోజనాలే.

బంగారమనే విలువైన లోహంతో స్వర్ణకారుడు అనేకరకాల ఆభరణాలు తయారు చేస్తాడు. ఆభరణాల అందం ప్రయోజనం వేర్వేరు కావచ్చును. కాని లోహం ఒక్కటే. పశువులు పాలిస్తాయి. పాలన్నీ తెల్లగానే ఉంటాయి. కాని పశువుల రంగులు వేరుగా ఉండవచ్చును. కాని పాలయొక్క లక్షణం, ప్రయోజనం మారవు.

ఈ ప్రకృతి అనేక రంగులతో సువాసనాభరితమైన పూలను, వాసనలేని పూలను కూడ మనకు అందిస్తుంది. వాటి ఆకారాలు రంగులు వేరైనను అవన్నీ పూలే. కొన్ని మాత్రమే మనం ఉపయోగించటం కద్దు. ఆ ఉపయోగాలలో భగవంతుని సేవకు, అర్చనకు, అలంకరణకు పూలు ఇతోధికంగా వాడడం అందరికీ తెలిసిన విషయమే. ఎన్ని రకాల పూలతో పూజించినా, ఎలా అలంకరించినా పూజయొక్క పరమార్థం, ప్రయోజనం ఒకే విధంగా ఉంటాయి. అదేవిధంగా ఏ మార్గంలో సాధన చేసినా జ్ఞానం ఒక్కటే. భగవత్తత్త్వమూ ఒక్కటే. ఆ భగవంతుని గూర్చి తెలుసుకోగల ఆత్మజ్ఞానాన్ని పొందటమే అంతిమ లక్ష్యం. కాబట్టి మార్గాలు వేరైనా, మనుషులు వేరైనా భగవంతుడొక్కడే అని చెప్పడం పై పద్య పరమార్థం.

"బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ! సనాతనమ్ ।
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్ ॥"

సర్వ ప్రాణులకు జననకారణమైన బీజమువంటివాడు పరమాత్ముడనగా సర్వవ్యాపకుడు, సర్వకారకుడనే గదా భావము. అదే అభిప్రాయము వేమన పద్యములలో పరోక్షముగా,

అడుగడుగునా వ్యక్తమౌతూనే ఉంటుంది.

**భక్తియున్నచోట బరమేశ్వరుండుండు**
**భక్తిలేనిచోట పాపముండు**
**భక్తికలుగువాడు పరమాత్ముడగునయా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

భక్తియొక్క ప్రయోజనం పారమార్థికమే కాదు, సామాజికం కూడ అని తెలియజెప్పే పద్యమిది. 'భజ్' అను ధాతువునుండి ఏర్పడిన పదమే భక్తి. అనగా సేవించుట అని అర్థము. ఈవిధమైన సేవ సామాన్యార్థములో చెప్పబడినది కాదు. "తనుహృద్భాషల" భగవంతుని సంసేవనమని దీనికి అర్థము. ఇట్టియెడల ఆ భక్తి ఒక పూజకో, ఒక పూజా మందిరానికో పరిమితం కాకూడదు. మనస్సంస్థితమై సదా అంతర్గతంగా ప్రకాశించే భావ సంపదతో చిత్తశుద్ధితో, నైర్మల్యంతో, అభ్యాసంతో కూడినదై ఉండాలి. అప్పుడే పాపపు ఆలోచనలకు, దుష్ప్రవర్తనలకు దూరంగా జీవన ప్రయాణం సాగుతుంది. ఇటువంటి భక్తికి ఆర్భాటాలు, హంగులు, హడావుడి అవసరం కావు. మనస్సు మాత్రమే ప్రధానము. సంపూర్ణమైన భక్తిభావన ఇటువంటి మానసిక పరిణతిని అందించాలి. అప్పుడు మాత్రమే ఆ జీవితం నిర్మలమై సామాజిక శాంతిని, అంతరంగ శాంతిని అందుకోగలుగుతుంది. పదిమంది మేలుకోరే సహృదయం సొంతమౌతుంది. అటువంటి మానవుడే మహనీయుడు. మాధవ సముడు కాగలడు. 'దేవుడులాంటివాడురా' అనే మాట యథాలాపంగా వాడుకలోకి వచ్చింది కాదు. ప్రవర్తన, మనోభావాలు, సామాజిక సేవ, వ్యక్తిత్వ పటుత్వం మొదలైన అనేక కోణాలలో మానవుని గమనించి ఉపయోగించిన పదబంధమే. కాబట్టి ఈ స్థాయిని సాధించటానికి తొలిమెట్టుగా వేమన భక్తిభావాన్ని సూచించాడు. ఈ భక్తిభావం మానవుని పరిణత మానవునిగా మార్చేదే గాని, చేసిన తప్పులకు ఇచ్చే దక్షిణ కాదు. పాప పరిహారార్థం చేసే కార్యక్రమాల సమాహారం కాదు. ఇష్టానుసారం ప్రవర్తించటానికి దేవుడిచ్చే అనుమతి అంతకన్నా కాదు. ఈనాటి సమాజంలో భక్తితో ముడిపెట్టి మానవులు కొంత మంది నడుస్తున్న తీరు గర్హించదగింది. నిజమైన భక్తితత్త్వాన్ని గ్రహించవలసిన అవసరం ఈనాడు ఎంతైనా ఉన్నది.

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।
స్వకర్మణా తమభ్యర్చ్యసిద్ధిం విందతి మానవః ॥

సర్వప్రాణి ప్రవృత్తికి కారణమైన పరమాత్మను అర్చించి మానవుడు సిద్ధిని పొందగలడు అని పై శ్లోక భావము. అట్టి పరమాత్మకు సభక్తికముగా చేసిన ప్రతికర్మ నిష్కామకర్మగా పరిణత స్థాయికి రాగల పరిస్థితి మానవుని మనోసాధన ద్వారా మాత్రమే సాధ్యము. ఆ సాధనకు తొలిమెట్టుగా చెప్పదగిన భక్తి భావన నిండి ఉన్న మనస్సులలో పాపపుటాలోచనలకు తావెక్కడిది? ఇంతటి నిగూఢమైన రహస్యాలను అతిసరళముగా చెప్పగలగడమే వేమన ప్రత్యేకత. ఇదే అంశాన్ని ఒక వేదాంతి లేదా ఒక ఆధ్యాత్మికవేత్త వివరించినపుడు ఇంతటి సారళ్యము సందేశము ఏకత్ర లభించుట కష్టసాధ్యము.

**ఆత్మయందె దృష్టినసువుగా నొనరించి**
**నిశ్చలముగ దృష్టినిలిపెనేని**
**అతడు నీవె సుమ్మి యనుమానమేలరా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

మానవుడు తన జీవనమార్గానుగామిగానే ఉండి, తన మనోదృష్టిని ఆత్మదర్శనము కోరి స్థిరపరచి ఏకాగ్రత పొందగలగాలి. అప్పుడే ఆత్మరూపములోనున్న భగవంతుడు తానేనని గ్రహించగలడు. అనగా ఆత్మజ్ఞానమును పొందగలడు.

భగవద్గీతా వచనమునను సరించి క్షేత్రజ్ఞునికి స్థానమైన క్షేత్రము శరీరమేకదా. ఇట్టి క్షేత్రమందే ఆత్మరూపమున సంస్థితమైన పరమాత్మను గూర్చి తెలిసికొనుటయే ఆత్మజ్ఞానము అనగా ప్రతి ప్రాణియందు ఉన్న భగవత్తత్త్వమును గుర్తించుట కూడ ఆత్మజ్ఞానానుబంధమే అగును.

సమం సర్వభూతేషు తిష్ఠం తం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి సపశ్యతి ॥

పై గీతావచన సారమంతా ఇమిడ్చిన పద్యముగా వేమన పద్యాన్ని భావించవచ్చును.

**చదువు చదువనేల? సంన్యాసి కానేల?**
**షణ్మతముల జిక్కి చావనేల?**
**అతను భజన చేసి యాత్మలో దెలియుడి**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఆధ్యాత్మికజ్ఞాన సముపార్జనకు అపారమైన పుస్తక పరిజ్ఞానము, వివిధ సిద్ధాంత

సమాలోచనము, సంన్యాస స్వీకరణము ప్రధాన కారణములు కావు. మనసే ముఖ్యమని వేమన అభిప్రాయము. చదువులనగా జీవనోపాధికి సంబంధించినవి కాదు. జ్ఞాన సముపార్జనకు అనుకూలములని భావించుచున్న మత గ్రంథములు, సిద్ధాంత గ్రంథములు, భక్తి కావ్యములు మొదలైనవి. ఎంతో శ్రమకోర్చి ఎన్నో సిద్ధాంతాలు, అభిప్రాయాలు గ్రహించి ఏది అనుసరణీయము, ఏది కాదు అను చర్చలతోనే జీవితాన్ని వృథా చేయడం ఆత్మసముపార్జన విధానాల ద్వారా పొందే నష్టమే గాని లాభం కాదు. అందువలన నిరాకారుడైన (అతను = శరీరము లేదా ఆకారము లేనివాడు) భగవంతుని ఏకాగ్రతతో భజించుట, స్మరించుట తద్వారా తనయందే ఆత్మరూపంలో ఉన్న పరమాత్మను దర్శించుట ఉత్తమ విధానమని వేమన సూచన.

శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।
ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాంతిరనన్తరమ్ ॥

జ్ఞానము, ధ్యానము, కర్మఫలత్యాగము, అలౌకికమైన శాంతి క్రమానుగతంగా మానవుడు సాధించడమే శ్రేయోమార్గమని సుస్పష్టము. తొలిమెట్టుగా చెప్పబడిన ఆ జ్ఞానము అభ్యాసము వలననే లభించగలదు. (ఇంతకంటె గొప్పగా ఏ కవిమాత్రము గీతాసారమును చెప్పగలడు. ఇంతటి లోతైన అవగాహన వేమనకు మాత్రమే సొంతమేమో.)



# వేమన - తత్వదర్శనము.9
# సాధనామార్గంలో గురువు ఆవశ్యకత - శిష్యునిపాత్ర
# (వేమన భావం)

**మాటలోని వాని మహిమఁదాఁదెలియక**
**మాటదెలియలేక మమత జిక్కె**
**మాట తెలిసెనేని మహితుడు యోగియౌ**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఈ పద్యంలో గురువును గూర్చి సూటిగా ప్రస్తావన లేదు. కాని వేమన సాధకునికి మంచి గురువు అవసరమని పదే పదే చెప్పిన విషయాన్నిబట్టి పై పద్యంలోని 'మాట'ను గరువచనంగా గురుబోధగా భావించనగును.

గురువు చెప్పిన మాటలలోని ఆంతర్యాన్ని గ్రహించలేనప్పుడు ఆయా మాటల విశిష్టత, మహిమ బోధపడవు. అటువంటప్పుడు ఆ మాటలను లౌకికార్థంలో అన్వయించుకుని మమతానుబంధాలకు బందీ కావడం జరుగుతుంది. కాని అందలి నిజమైన, లోతైన భావాన్ని గ్రహించగల్గిన వ్యక్తి గొప్ప యోగి కావడం సులభం. నిజానికి వేమన పద్యాలలో అధికభాగం ఇటువంటి అన్వయాన్ని కల్గి ఉంటాయి. పైకి అతి మామూలు విషయంగా అన్పించినా, తరచి చూస్తే లోతైన ఆత్మతత్త్వం తేలికైన పదజాలంలో గోచరిస్తుంది.

**మత్సరంబుమదము మమకార మనియెడి**
**వ్యసనములను దగిలి మసలబోక**
**పరులకుపకరించి పరముండవగు పొమ్ము**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అహంకారము, అసూయ, మోహము మొదలైన లక్షణాల నుండి బుద్ధిశాలియైన మనిషి తన మనస్సును దూరం చేయలేనప్పుడు వ్యసనపరుడు మాదిరిగానే ఆయా అవగుణాలకు బానిసగా మారుతాడు. అంతర్గతంగా ఉన్న ఆయా అవలక్షణాల ప్రభావమే ఆయా వ్యక్తుల ఆలోచనల్లో, అభివ్యక్తీకరణలో అడుగడుగునా

తొంగిచూస్తుంది. అదే వారి ప్రవర్తనలో అవాంఛనీయ ధోరణులకు కారణభూత మౌతుంది. స్వార్థం తలకెక్కి అణచివేత ధోరణులు, అరాచక విధానాలు గొప్పగా అన్పిస్తాయి. ఉపకారం చెయ్యలేకపోయినా అపకారం చెయ్యకుండా ఉంటే చాలనే కనీస ధర్మం కూడ కనుమరుగవుతుంది. అందుచేత ఆయా గుణాలకు బానిస కాకుండా మసలుకొమ్మని, పరోపకారం చేయమని వేమన హితవు పలికాడు. "పరోపకారము పరమధర్మము" అనికదా భారతీయ సనాతన ధర్మ సారాంశం. ఆ పరోపకారము చేయడం వలననే పరముడు లేదా ఉత్తముడవు కమ్మని వేమన సందేశం. అట్టి పరోపకారిని దైవస్వరూపుడుగా వేమన భావిస్తున్నాడు. "వాడు దేవుడులాంటివాడురా" అనే సామాజిక ప్రయోగం వెనుక ఉన్న అర్థం ఇక్కడ కన్పిస్తున్నది. అటువంటి శక్తి, యుక్తి, అవగాహన, జ్ఞానం, సాధనాసక్తి కలగడానికి గురువును ఆశ్రయించడం తప్పనిసరి అని భావించిన వేమన శిష్యలక్షణాన్ని కూడ చక్కగా వివరించాడు.

**ఛాత్రధర్మమెఱిగి చక్కని భక్తితో**
**గురునిసేవ చేయ గుదిరినపుడె**
**సర్వమర్మములును జక్కగావిడిపోవు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఛాత్రుడు అంటే శిష్యుడు. శిష్యుడు తను ప్రవర్తించవలసిన తీరుతెన్నులను చక్కగా గుర్తించటం మొదటి లక్షణం. గురువుపట్ల గురి, అనురక్తి, ఇష్టం మొదలైన సానుకూల భావాలు కల్గి ఉండటం రెండవ లక్షణం. ఇటువంటి సల్లక్షణ సంపన్నుడై గురువును సేవించవలసిన విధానాన్ని గుర్తించి, నిశ్చలమైన భావంతో శిష్యరికం చేయాలి. అట్లా సేవ చేసినపుడే సకల రహస్యాలు తేటతెల్లమై స్పష్టంగా తెలుస్తాయని వేమన అనుభవంతో చెప్పిన మాట. ఇక్కడ మర్మములంటే ఆధ్యాత్మిక రహస్యాలు, జ్ఞానసముపార్జనా విధానాలు మాత్రమే. అవి స్పష్టంగా అర్థమైనప్పుడు జ్ఞానిగాను, యోగిగాను మారడం సులభమౌతుంది. అలాకానప్పుడు గానుగెద్దు మాదిరిగా శ్రమపడటం మాత్రమే సొంతమౌతుంది. గురువుమీద గురి, విశ్వాసం, భక్తి లేని శిష్యునికి విముక్తి, ముక్తి ఉండవు. అట్టివాని జీవితం క్రింది విధంగా ఇరకాటంలో పడి బయటికి రాలేని దుస్థితికి చేరుతుంది.

**గురుని నిందజేసి గుట్టైఱుంగని వాడు**
**యముని బాధనొందు గ్రమముగాను**
**తేనెలోని యీగ తెఱగున నగునయా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

తేనె చిక్కగా ఉండటంచేత దానిలో పడిన ఈగ పైకెగరలేదు. అందులోనే ఉండి కొట్టుమిట్టాడుతుంది. అదేవిధంగా గురునింద చేసినవాడు ఆధ్యాత్మిక రహస్యాలు, సాధనా మార్గాలు, లోతుపాతులు తెలిసికొనలేడు. వాడు ఈ భవబంధాలలో పడి, ఇరుక్కుపోయిన ఈగమాదిరిగానే ఏదో చేయాలని తాపత్రయపడుతూ, ఆ బంధాలనుండి, విడివడలేక అక్కడే ఉండిపోతాడు. వాడికి విద్యవల్ల కలుగవలసిన వివేకం, విజ్ఞానం, విముక్తి ఆమడదూరంలోనే ఉంటాయి. చివరకు పాపపంకిలమైన బాహ్యప్రపంచం లోనే ఉండి నరకబాధలకు గురికాక తప్పదు. అందుకే మంచి గురువును ఆశ్రయించి, ధర్మానుసారము ప్రవర్తించి, ఇహలోక బంధాలనుండి దూరంగా జరిగి ధన్యులు కావాలని వేమన సూచిస్తున్నాడు.

ఇంతకూ ఆ గురువు ఎలాంటివాడై ఉండాలి? మంచి గురువంటే ఎవరు? ఆ గురువు బాధ్యత, లక్షణం ఎలా ఉంటుంది అనే విషయానికి వేమన పద్యమే సమాధాన మిస్తున్నది.

**గురువు తానయినను హరునితాఁజూపును**
**బ్రహ్మలోకమితడు పాఱజూపు**
**శిష్యునరసి తట్టి చీకటి బాపురా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

తాను కేవలము గురువుమాత్రమే అయినప్పటికిని మంచి గురువు తన శిష్యునికి భగవంతుని చూపిస్తాడు. అనగా పరమాత్మను తెలిసికొనగల, దర్శించగల వివేకాన్ని, జ్ఞానాన్ని, ఆత్మశక్తిని తన బోధనల ద్వారా అందిస్తాడు. శిష్యుని స్థాయిని గుర్తించి, వెన్నుతట్టి ప్రోత్సహించి అజ్ఞానమనే చీకటిని పోగొట్టి జ్ఞానమనే వెలుగును చూపిస్తాడు. “గురు” శబ్దాన్ని సార్థకం చేస్తాడు. కాబట్టి పైవిధంగా గురుశిష్య లక్షణం, సంబంధం ఉంటే ఆత్మదర్శనం, ఆత్మజ్ఞానం కలగటం సులభతరమౌతుంది. అందుకే వేమన ఇలా చెప్పాడు

**సాధనంబు లేక సమకూడదేదియు**
**బోధలేని విద్య పొందదెపుడు**
**పాదుకొల్పి మదిని భావించి చూడరా**
**విశ్వదాభిరామ వినురవేమ.**



# III

## వేమన సామాజిక దృక్పథం.1

**కులములోన నొకడు గుణవంతుడుండిన**
**గులము వెలయు వాని గుణము వలన**
**వెలయు వనములోన మలయజంబున్నట్లు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

కులాచార నియమాలు నూటికి నూరుపాళ్ళు పాటించిన సమాజంలోని వాడు వేమన. ఆయా సమయాలను, ఆచారాలను బట్టి కలిగే కష్టనష్టాలను స్వయంగా చూసినవాడు వేమన. అందుకే ఆయన కులాలకు, మతాలకు ప్రాధాన్యం ఇవ్వలేదు. గుణానికే అగ్రతాంబూలమిచ్చాడు. మంచితనానికే పెద్దపీట వేశాడు. సమసమాజానికి బీజం వేశాడు. నిరర్థకాలనిపించిన కొన్ని ఆచారాలను, సిద్ధాంతాలను నిర్మొహమాటంగా విమర్శించాడు. హేతువాదిగా కన్పించాడు. ప్రజాకవిగా స్థానం పొందాడు. గొప్ప ఆధ్యాత్మిక విలువలను, సామాజిక విలువలను తన రచనలో నింపివేశాడు. అనుభవాన్ని ఆ విలువలకు జోడించాడు. అదే వేమన ప్రత్యేకత. నేల నొదిలి సాము చేయలేదు. నలుగురితోపాటు ఉంటూనే అంతర్ముఖుడయ్యాడు. అటువంటి వేమన ప్రతి వంశం, కులం సార్థకం కావాలని, మంచి పేరుప్రతిష్ఠలు పొందాలని భావించి ఉంటాడు. అందుకే వంశ ప్రతిష్ఠను ప్రస్తావించాడు. వంశంలో ఒక మంచివాడుంటే ఆ వంశానికే మంచిపేరు వస్తుందని చెప్తూ అందుకు ఉదాహరణగా అడవిలోని మంచిగంధపుచెట్టును పేర్కొన్నాడు. ఒక చందన వృక్షంవల్ల అడవి అంతా సువాసనలు గుబాళిస్తాయి. అట్లే ఒక మంచి వ్యక్తివల్ల కులమంతా బాగుపడుతుంది. ఉన్నతమైన గౌరవార్హతను పొందుతుంది అని తన పద్యం ద్వారా వక్కాణించాడు. మన ఇతిహాసాలలో చరిత్రలో అటువంటి వారెందరో ఉన్నారు. భరతుని పేరుతో భారతదేశమనే పేరు వచ్చింది. ఆ వంశం భరతవంశమైనది. ఆ వంశీయుల కథ భారతమైనది. ఇట్లా ఉదాహరణలు కోకొల్లలు.

అలా కానప్పుడు ఏం జరుగుతుందో కూడా వేమన పద్యాలలోనే చూడవచ్చు.

**ఉత్తముని కడుపున నోగు జన్మించిన** (ఓగు = చెడ్డవాడు)
**వాడు చెఱచువాని వంశమెల్ల**
**చెఱకువెన్నుపుట్టి చెరచదా తీపెల్ల**
**విశ్వదాభిరామ వినురవేమ.**

మంచివానికి పుట్టిన బిడ్డ దుర్మార్గుడైతే వాడి ద్వారా వంశ ప్రతిష్ఠ మసక బారుతుంది. వెన్నువేసిన చెఱకులో తీపి తగ్గిపోవడంలాగే ఇది కూడా జరుగుతుందన్నమాట. అంతేకాదు

**"కులములోన నొకడు గుణహీనుడుండెనా**
**కులము చెడును వాని గుణము వలన".**

కాబట్టి వ్యక్తిగతమైన గుణగణాలు అత్యంత ప్రధానములు. అవి వ్యక్తిగత జీవితంతోపాటు సమాజానికి, వంశానికి ఎంతో అవసరం అన్నది సారాంశం. ప్రస్తుత సమాజంలో విలువలు, ఆత్మీయతలు తగ్గిపోతున్నాయని, అసహనం, అంతర్యుద్ధాలు పెరిగిపోతున్నాయని విజ్ఞుల విశ్లేషణ. మరి ఈ సమాజంలోని కలుపుమొక్కల్లాంటి పై లక్షణాలను దూరం చేసే వైద్యులెవరు? రచయితలా? గురువులా? సంస్కర్తలా? ఎవరు ముందుకురావాలి? అందరి బాధ్యత ఇది అని గుర్తించాలి. మానసిక ఆలోచనాధోరణిలో మార్పు తీసుకువచ్చే ప్రయత్నం ఒక ఉద్యమంలా రావాల్సిన అవసరం ఎంతైనా ఉ ందని గుర్తించకపోతే భవిష్యత్తరాలు వెలుగునుండి చీకట్లోకి ప్రయాణించక తప్పదు. ఏ పనియైనా ప్రారంభంలోనే ఫలితాన్నివ్వదుకదా! సాధన చేస్తేనే సాధ్యమౌతుంది. అలాంటిదే పైన చెప్పిన సంస్కరణాయత్నం కూడా.

**అనగననగ రాగ మతిశయిల్లుచునుండు**
**దినగదినగ వేము తీయగుండు**
**సాధనమున పనులు సమకూరు ధరలోన**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అంతేకాకుండా ప్రతిఒక్కరు చక్కగా మాట్లాడటం నేర్చుకోవాలి. నొవ్వకుండ, నొప్పించకుండా ప్రవర్తించగలగాలి. మాట నేర్పుతోపాటు సమయం, సందర్భం తెలిసి మాట్లాడటం, ప్రవర్తించటం చేయాలి. వ్యక్తి సామాజిక జీవనంలో తొలిమెట్టు ఇది.

**చందమెఱిగి మాట జక్కగా చెప్పిన**
**నెవ్వడైన మాఱికేల పలుకు?**

**చందమెఱిగి యుండు, సందర్భమెఱుగుము**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అందుకే "మంచి కాలమపుడె మర్యాద నార్జింపు" మని వేమన హితోపదేశం చేశాడు. కులాధిక్యతలవంటి వాటికి వేమన వ్యతిరేకి అనే విషయం క్రింది పద్యంలో చూడవచ్చు. గుణానికి, జ్ఞానానికి వేమన ప్రాధాన్యమిచ్చిన విషయం కూడా ఈ పద్యంలో కన్పిస్తుంది.

**జాతులందు మిగుల జాతి యేదెక్కువో?**
**యెఱుకలేక తిరుగనేమి ఫలమొ?**
**యెఱుక గలుగువాడె యెచ్చైన కులజుడు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఏ కులమూ ఎక్కువ కాదు. తక్కువకాదు. జ్ఞానము లేకుండా గొప్పకులమంటూ చెప్పుకుని తిరిగితే సరిపోదు. జ్ఞానముగూర్చి ఆలోచించకుండా కులం గురించి ఆలోచించడం వృథా. జ్ఞానం ఉన్నవాడే గొప్ప కులస్థుడు అని వేమన పై పద్యం ద్వారా చెప్పాడు. గుణ, కర్మల ననుసరించి ఏర్పడినవీ కులాలు, కుల వ్యవస్థ అని గదా గీతావచనము. అందువల్ల కులం కాదు జ్ఞానం ముఖ్యం. వాగ్భూషణమే మానవులకు నిజమైన అలంకారము. అనగా మంచి మాటే పెట్టని ఆభరణమన్నమాట. అదే విషయాన్ని వేమన కూడా భంగ్యంతరముగా ఇలా చెప్తున్నాడు.

**వాక్కువలన గలుగు పరమగు మోక్షంబు**
**వాక్కువలన గలుగు వరలుఘనత**
**వాక్కువలన గలుగునెక్కుడైశ్వర్యంబు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

మాటలాడే తీరు సమాజంలో గొప్పతనాన్ని, సిరిసంపదలను ఇస్తుంది. మోక్ష ప్రాప్తిని కల్గిస్తుంది. కాబట్టి ప్రతి ఒక్కరు **పరుషపద ప్రయోగము, భావ తీవ్రత, ఆవేశపూరిత భాషణము** మొదలైనవి అలవరచుకొనకుండా, మృదు మధురమైన, సున్నితమైన రీతిలో సంభాషించడం అలవాటు చేసికోవాలి. మాట తీరు మనిషి ప్రవర్తనకు కొలమానం. సున్నిత స్వభావుల భాష, భాషణం సున్నితంగానే ఉంటాయి. తద్భిన్నమైనవారికి తగినట్లే వారి మాటతీరు ఉంటుంది. **మంచిమాట మనుషుల్ని దగ్గరచేస్తే, కఠినభాషణం దూరం పెంచుతుంది.** మాటే మానవుని సంస్కారానికి,

ప్రవర్తనకు ప్రతీక కావాలి. అంతేకాదు మాట్లాడటంలోని నైపుణ్యాన్ని సొంతం చేసుకున్నవారిని చిన్న, పెద్ద అని వయసును బట్టి నిర్ణయించకూడదు. పిన్నలైనా వారికి తగు గుర్తింపు, గౌరవం ఇవ్వాలి.

**మాటలాడగల్గు మర్మము లెఱిగిన**
**పిన్నపెద్దతనము లెన్నవలదు**
**పిన్నచేతి దివ్వె పెద్దగా వెలుగదా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

దీపం పెద్దవారిచేతిలో ఉన్నా, చిన్నవారి చేతిలో ఉన్నా ఒకే రకంగా వెలుగునిస్తుంది కాని మనిషిని బట్టి మారదు. మాట నేర్పు, మంచితనం, విజ్ఞానం కూడా అంతే. చిన్నవారికైనా, పెద్దవారికైనా ఒకటే. కాబట్టి వయసు కాదు విషయం ముఖ్యం. ఇలా వేమన సామాజిక, వైయక్తిక విధానాలను పరిశీలించి స్వీయానుభవాన్ని జోడించి అంతిమ తీర్పు మాదిరిగా తన అభిప్రాయాన్ని వెలువరించాడు.



# వేమన సామాజిక దృక్పథం.2

**తప్పులెన్నువారు తండోపతండంబు**
**లుర్విజనులకెల్ల నుండు తప్పు**
**తప్పులెన్నువారు తమ తప్పు లెరుగరు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఈ భూమిపైనున్న ప్రతి మనిషి తెలిసో తెలియకో ఎప్పుడో ఒకసారైనా ఏదో ఒక తప్పు చేయడం సర్వసాధారణం. అది చిన్నతప్పు కావచ్చు, పెద్దతప్పు కావచ్చు. కాని చేసిన తప్పును గుర్తించి, అంగీకరించి, సరిదిద్దుకోవడం, పునరావృతం కాకుండా చూసుకోవడం మనీషి లక్షణం. (మనీషి = బుద్ధిమంతుడు)

అలాకాకుండా గురివెందగింజ (గురువింద గింజ) సామెతగా తన తప్పులను గుర్తించకుండా, ఎదుటివారిలో తప్పులు వెదకి, వారిని తెగనాడటం అతి మామూలు వ్యక్తుల పద్ధతి. సంస్కారహీనుల నైజమిది. ఏదేమైనా తమగురించి ఆలోచించుకోకుండా ఎదుటి తప్పులను ఎత్తిచూపాలనుకునేవారు, చూపేవారు ఈ భూమిపై అధిక సంఖ్యలో ఉన్నారు. ఇది ఆహ్వానించదగిన పరిణామం కాదు. ప్రతివారు ఆత్మవిమర్శ చేసుకోవడం అవసరమన్నది వేమన అభిప్రాయం. తప్పు చేయడం సహజమైనా, పదేపదే తప్పులు దొర్లకుండా ఎవరిని వారు తీర్చిదిద్దుకోవలసిన అవసరాన్ని ఈ పద్యం తెలియచేస్తున్నది.

**తనకు గలుగు పెక్కు తప్పులు నుండగా**
**ఓగునేరమెంచు నొరుల గాంచి**
**చక్కిలంబు జూచి జంతిక నగినట్లు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

తన తప్పులు దాచిపెట్టుకుని చెడ్డవాడు ఇతరుల తప్పులను వెదికే ప్రయత్నం చేస్తాడు. చక్కిలము తన యందలి వంకరలను వదలిపెట్టి జంతిక యందలి వంకరలు చూసి ఎగతాళి చేసినట్లుగా ఉంటుంది ఈ దుర్మార్గుల చర్య. కానివారు మాత్రం ఇదేమీ పట్టించుకోరు. అనగా తప్పులు ఎత్తిచూపటం తప్ప మరోరకమైన ఆలోచన వీరికి రాదన్నమాట. ఇటువంటి మనస్తత్వం సమర్థనీయం కాదని వేమన ఉద్దేశ్యం.

ఇటువంటి ప్రవర్తనవల్ల అల్పత్వం సూచితమౌతుంది. ఎదుటివారి మనస్సు నొచ్చుకుంటుంది. తోటివారు దూరమౌతారు.

**ఇనుము విరిగెనేని యినుమారు ముమ్మారు**
**కాల్చి యతుక వచ్చు క్రమముగాను**
**మనసు విరిగెనేని మరి కూర్పవచ్చునా**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

ఎదుటివారి మాటతీరుతో, ప్రవర్తనతో ముక్కలైన మనస్సును తిరిగి అతికించటం సాధ్యం కాదు. అనగా సానుకూలంగా మార్చలేము. ఇనుము వంటి లోహాలనైతే ఒకటి రెండుసార్లు కాల్చి సాగగొట్టి అతికించవచ్చును. కాని మనసు లోహం కాదుగదా. కాబట్టి పరిస్థితిని అంత దూరం తెచ్చుకోకూడదని సారాంశం.

**మాటలాడ నేర్చి మనసు రంజిలజేసి**
**పరగ బ్రియము చెప్పి బడలకున్న**
**నొకరి చేతి సొమ్ములూరక వచ్చునా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఇతరులనుండి వివిధ సందర్భాలలో సొమ్ము రాబట్టాలంటే మెప్పించే విధంగా మాట్లాడి వారి మనస్సును ఆకట్టుకోవాలి. వారికి నచ్చేవిధంగా నైపుణ్యంగా మాట్లాడాలి. ఆ విధంగా కష్టపడితేనే ధనప్రాప్తి. లేకపోతే చివాట్లు ప్రాప్తిస్తాయి. ఈ పద్యం లౌక్యమెరిగి నడుచుకోవాలనే విషయాన్ని బోధిస్తున్నది. నోరు మంచిదవ్వాలన్న హితోక్తిని చెప్తున్నది.

**పరగరాతి గుండు బగుల గొట్టగవచ్చు**
**గొండలన్ని పిండి గొట్టవచ్చు**
**కఠినచిత్తు మనసు కరిగింపగారాదు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

పైన చెప్పిన అంశాలలో మొదటి రెండు కష్టసాధ్యాలేగాని అసాధ్యాలు కావు. కాని మూడవదైన కఠినాత్ముని మనస్సును మార్చటం మాత్రం ఎవరికిని సాధ్యం కాదు. అనగా వాడి హృదయంలో సున్నితత్వం ఏ పరిస్థితుల్లోనూ కల్గించలేము. భర్తృహరి సుభాషిత త్రిశతిలో కూడ మూర్ఖులగురించి ఇటువంటి అభిప్రాయమే చెప్పాడు. ఇంకొక్క అడుగు ముందుకు వేసి అసాధ్యములైన కుందేటికొమ్ము, ఇసుకనుండి తైలం

సాధించవచ్చు నన్నాడు. కాని మూర్ఖుడిని మార్చటం అసాధ్యమని అన్నాడు. ఇలా చెప్పటానికి కారణం విషయతీవ్రతను, జటిలతను తెలియచేయటానికే. వేమన వేరొక చోట వంకరగా ఉన్న కర్రను గాల్చి వంకర తీయవచ్చునన్న మాటను కూడ కఠినాత్ముల మనసునుగూర్చి చెప్పే విషయంలో ఉపయోగించాడు. నిజానికి కర్రను కాలిస్తే వంకర పోవడమేమో గాని కర్ర కాలిపోవడం ఖాయం. మరి ఇలా చెప్పడానికి కారణం ఆ జటిలతను తెలియపర్చేందుకే యై ఉంటుంది.

మూర్ఖుల మనస్సుకు మాటకు నిలకడ ఉండదనేది మరొక అంశం. నీళ్ళమీద వ్రాస్తే ఆ వ్రాత నిలబడదు. ఆ వ్రాతవల్ల ఉపయోగం ఉండదు. ఆ పనికి ఏ పరమార్థం ఉండదు. మూర్ఖుడి ఆలోచనా విధానం కూడా అలాంటిదే. దానికి మంచి, చెడు తెలియదు. ఎప్పుడు ఎలా తోస్తే అలా మాట్లాడటం మూర్ఖత్వపు నైజం.

**నీటిలోని వ్రాత నిలువక యున్నట్లు**
**పాటి జగతి లేదు పరములేదు**
**మాటి మాటికెల్ల మాఱును మూర్ఖుండు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఇంతకూ ఆ మూర్ఖుడు ఎవరంటే –

**మాటజెప్ప వినని మనుజుడు మూర్ఖుడు**
**మాట విన్న నరుడు మానుడగును**
**మాట వినగ జెప్ప మానుట కూడదు**
**విశ్వదాభిరామ వినురవేమ.** (మానుడు–మంచివాడు, మాన్యుడు)

ఎదుటివారి మాటను చొరనివ్వకుండ, తనమాటే వేదవాక్కు అనేవిధంగా ప్రవర్తించేవాడే మూర్ఖుడు. ఎదుటివారి మాట విని ఉచితానుచితాలను గూర్చి ఆలోచించేవాడు మాన్యుడు. ఎదుటివారి మాటను నిరాకరించకూడదు. కాని విని సరియైన సమాలోచన, నిర్ణయం చేయగలగాలి. "కల్ల, నిజము తెలిసిన మనుజుడే పో నీతిపరుడు" అన్న పద్యపాదం కూడా ఇదే భావాన్ని స్పష్టం చేస్తుంది. ఒక వ్యక్తి తన వ్యక్తిత్వానికి పదును పెట్టి వికసింపచేసుకోవాలంటే ఇంతకంటే గొప్ప మార్గనిర్దేశం ఏముంటుంది?

**ఆడితప్పువారలభిమానహీనులు**
**గోడెఱుగని కొద్దివారు**

**కూడికీడుసేయ గ్రూరుండు తలపోయు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఆత్మాభిమానం లేనివారే అడుగడుగునా చెప్పిన మాటను నిలబెట్టుకొనకుండా అబద్ధాలాడతారు. ఇతరులకు కలిగే బాధను గుర్తించలేని అల్పులతో కలిసి కీడుచేయాలనుకునేవాడు క్రూరుడు. ఈ రెండు లక్షణాలు ఒకదానికొకటి ఆత్మబంధువుల్లాంటివి. అందుకే ఏకత్ర తటస్థిస్తాయి. కాని ఇవి గొప్ప విషయాలేం కావు. మిక్కిలి గర్హణీయాలు. వీటిని దూరంగా ఉంచటం గొప్ప వ్యక్తిత్వానికి సంకేతం. ఒక్కమాటలో చెప్పాలంటే వ్యక్తిత్వ వికాసానికి సోపానాలు వేమన పద్యాలు. (అలాంటివే ఇతర శతకాలలోను ఉన్నాయి.)



# వేమన సామాజిక దృక్పథం.3

**తామసించి చేయ తగదెట్టి కార్యంబు**
**వేగిరింప నదియు విషమె యగును**
**పచ్చికాయ దెచ్చి బడవేయ ఫలమౌనె**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

సరియైన ఫలితాలను పొందగోరువారు తొందరపడి మూర్ఖంగా ఏ పని చేయకూడదు. అదనుచూసి చేసినప్పుడే సరైన ఫలితం వస్తుంది. తొందరబడితే కొన్నిసార్లు ప్రతికూల ఫలితాలు ఎదురౌతాయి. పచ్చి కాయను తెచ్చిపడేస్తే అది పండదు. పక్వాని కొచ్చేవరకు ఆగి చెట్టునుంచి కోయాలి. అలాగే జీవితంలో తీసుకోవాల్సిన అనేక నిర్ణయాలు కూడా ఆచి తూచి ఆలోచించి సరైన సమయంలో తగురీతిలో స్పందిస్తేనే సఫలమౌతాయి. మానవులు లౌకిక జీవితంలో ఎలా నడచుకోవాలో, ఆలోచించాలో తెలియచేస్తున్న లోకజ్ఞాన ప్రబోధకమైన పద్యమిది.

మనకు అనుకూలమైన పరిస్థితుల్లో, ప్రదేశాలలో మాత్రమే మన పెద్దరికాన్ని ప్రదర్శించాలి. ప్రతికూలతలు ఎదురైనప్పుడు తటస్థంగానో, మౌనంగానో మసలుకోవడమే మంచి మార్గమని వేమన క్రింది పద్యాల ద్వారా సూచించాడు.

**చిక్కియున్నవేళ సింహంబునైనను**
**బక్కకుక్కకరచి బాధచేయు**
**బలిమిలేని వేళ బంతంబు చెల్లదు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

బలహీనపడినప్పుడు మృగరాజైన సింహాన్ని బక్కచిక్కిన గ్రామసింహం కరచి బాధపెడుతుంది. సింహం ఎంత గొప్ప జంతువైనా పరిస్థితి చేయిజారినపుడు బాధలు తప్పవు. ఎంత గొప్పవారైనా అంగబలం, ఆర్థికబలం లేనప్పుడు మనుషుల పరిస్థితి కూడ అంతే. అందుకే పరిస్థితులు వ్యతిరేకించినప్పుడు పంతాలకు పోయి కష్టాలు కొని తెచ్చుకోకుండా మౌనం వహించడం మేలు.

"పదుగురాడు మాట పాటియై ధరజెల్లు" నన్న న్యాయాన్ని అనుసరించి

నలుగురితోపాటు నడచుకోవలసిన సందర్భాలు ఎదురౌతాయి. అవసరాన్ని బట్టి ఆలోచించు కోవడం ఉత్తమం.

మనిషికి అపరిమితమైన ఆశకూడ శత్రువే. జీవనయానంలో ఆశలేనిదే ఏదీ సాధించలేము. కాని అదే ఆశ అనాలోచిత ఆచరణలకు దారితీస్తే చేటు తప్పదు. చిన్నయసూరి నీతిచంద్రికలోని 'పులి–బాటసారి' కథలోని బాటసారికి పట్టిన గతే పడుతుంది.

**నీళ్ళలోన మీను నెరమాంస మాశించి**
**గాలమందు జిక్కుకరణి భువిని**
**ఆశదగిలి నరుడు అలాగె చెడిపోవు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

గాలానికి తగిలించిన ఆహారానికి ఆశపడిన చేప గాలానికి చిక్కుకున్న మాదిరిగా, ఆలోచన లేకుండా ఆశకు లోబడిన వ్యక్తికూడ తనకు తానే కీడును కొనితెచ్చుకుంటాడని భావం.

దుర్జనులు సజ్జనులుగా మారడం అరుదు. వారు మంచివారితో కలిసి ఉన్నను అంతర్గతంగా ఉన్న సహజలక్షణం నశించదు. రుచిపచిలేని పాపరకాయలలో పాలు, పంచదార పోసినంత మాత్రాన అవి మధురంగా మారవు. దుర్మార్గులు కూడా అంతే. కాబట్టి మారిపోయారని భ్రమించి వారిని పూర్తిగా నమ్మకూడదు.

అట్లే మానవుడు తాను ఉండకూడని ప్రదేశాలలో ఉన్నప్పుడు లోకులు తప్పుగా భావించి నిందలువేస్తారు. అకారణంగా నిందలపాలై చింతించకుండా ఉండాలంటే నిలువదగని చోట్లకు పోకూడదు.

**పాలనీడిగింటగ్రోలుచుండెనా**
**మనుజులెల్ల గూడి మద్యమండ్రు**
**నిలువదగినచోట నిలువనిందలు వచ్చు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

కల్లు అంగట్లో కూర్చుని పాలు త్రాగినా జనం కల్లు త్రాగాడనే అంటారు. అందుకే పోకూడని తావులకు పోకూడదు. అలా పోతే నిందలు మోయక తప్పదు. తస్మాత్ జాగ్రత్త.

నీటిలోని చేప ఎంతదూరమైనా ప్రయాణిస్తుంది. నేలమీద పడవేస్తే మూరెడు దూరం కూడా పోలేదు. దీనికి కారణం ఆ చేప బలం కాదు. స్థానబలం మాత్రమే. అందుకే తన ఊరు వాడ కానిచోట మానవుడు కూడా తన మాట నెగ్గించుకోవడం కష్టమని గుర్తించి సమయానుకూలంగా ప్రవర్తించాలి అని వేమన సందేశం. అంతేకాదు, ఎవరికి వారు స్వయంకృషితో స్వయంశక్తితో నిలబడాలి. మన చుట్టూ ఉన్నవారు గొప్పవారని విర్రవీగితే వారి గొప్పతనం మనకు అంటుకోదని గుర్తించాలి. పండితుల చెంతనున్న నిరక్షరకుక్షి పండితుడుగా మారదుకదా. వాడి కృషితో వాడు చదువుకోవాలి. నేర్చుకోవాలి.

**విద్యలేనివాడు విద్యాధికుల చెంత**
**నుండినంత పండితుండు కాడు**
**కొలని హంసలకడ గొక్కెర యున్నట్లు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

హంసలదగ్గర ఉన్నంతమాత్రాన కొంగ హంసగా మారదుకదా. ఏ విషయంలోనైనా పట్టుపట్టకూడదు. పట్టుపడితే ఆ పనిని నెరవేర్చి తీరాలి. ఈ రకమైన దృఢవైఖరి మానవులకు చాల అవసరం. అందుకే 'పట్టువిడుచుటకన్న బరగజచ్చుట మేలు' అని వేమన కార్యశూరులు కాని వారిని గూర్చి నిష్ఠురంగా చెప్పాడు.

**అనువుగానిచోట నధికులమనరాదు**
**కొంచెమైన నదియు గొదువకాదు**
**కొండయద్ద మందు గొంచెమై యుండదా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అనేకమంది వ్యక్తులమధ్య, వేర్వేరు ప్రాంతాలలో, రకరకాల మనస్తత్వాలతో సంబంధాలు కలిగి ఉండవలసిన మానవుడు కొన్నిసార్లు తన స్థాయిని తగ్గించుకుని బ్రతకవలసిరావచ్చు. అలా తగ్గి ఉండటం అగౌరవమేమీ కాదు. పెద్ద కొండ అద్దంలో చిన్నదిగానే కన్పిస్తుందిగదా అంటూ వేమన బ్రతుకు బండికి మార్గనిర్దేశం చేస్తున్నాడు. సమాజంలో మామూలు మనిషి తన వేషభాషాదులను అప్రధానంగా భావించి అపరిశుభ్రంగా ఉంటే ఉన్నత కులంలో పుట్టినవాడినైనా జనం నీజంగానే చూస్తారు. కాబట్టి తన తోడి సామాజికులతోపాటు ఉండటం అవసరం అని లౌకిక జీవితానుభవాన్ని గడించిన వేమన క్రింది విధంగా సలహా ఇచ్చాడు.

**మైలకోకతోడ, మాసిన తలతోడ**
**నొడలుమురికితోడ నుండె నేని**
**నగ్రకులజుడైన నట్టిట్టు పిలువరు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అంతేకాదు. ఆపదలు వచ్చినప్పుడు సాయపడినవారే నిజమైన బంధువులు. భయం కల్గించే సమయాలలో ఆ పరిస్థితిని ఎదుర్కొన్నవాడే వీరుడు. పేదరికంలోను తోడు ఉన్నప్పుడే భార్య గొప్పది. అని వేమన లోకం తీరును చెప్పి లోకులను మేల్కొల్పుతూ క్రింది పద్యం చెప్పాడు.

**ఆపదలగువేళ నరసి బంధులజూడు**
**భయము వేళ జూడు బంటు తనము**
**పేదవేళ జూడు పెండ్లాము గుణము**
**విశ్వదాభిరామ వినురవేమ.**

చివరగా వేమన సామాజికుల మాటలు, చేతలు గూర్చి ఇలా సిద్ధాంతీకరించాడు. పరోక్షంగా చేయవలసిన పనిని సూచించాడు.

**మాటలాడవచ్చు మనసు దెల్పగ లేదు**
**తెలుపవచ్చుదన్ను తెలియలేదు**
**సురియబట్టవచ్చు శూరుడు కాలేదు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

కాబట్టి **చెప్పటం మాత్రమే కాదు. ఆచరించడం ముఖ్యం.** దానిని సాధించాలి అన్నది తుది సందేశం.



# వేమన సామాజిక దృక్పథం.4

సాధారణముగ ఉన్నతమైన, ఉదారమైన ఆశయాలు, లక్షణాలు గల మనస్తత్త్వం గలవారి ప్రవర్తన ఓర్పు, నేర్పు కలిగి, తొణికిసలాడని నిండుకుండవలె ఉంటుందన్నది అనుభవజ్ఞుల అభిభాషణ. ఈ మనస్తత్త్వాలు, ప్రవర్తన తీరుతెన్నులు, వారివల్ల వచ్చే కష్టనష్టాలు, ఉపయోగాలు మొదలైన అంశాలేవీ వేమన పరిశీలన నుంచి దూరంగా పోలేదు. అందుకే ఆయా అంశాలన్నీ వేమన శతకంలో పద్యాలుగా రూపుదిద్దుకున్నాయి.

**గంగపాఱు నెపుడు గదలని గతితోడ**
**మురికివాగు పాఱు మ్రోతతోడ**
**పెద్దపిన్నతనము పేర్మియీలాగురా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

పెద్దరికంతో ఉన్నవారు గంగానదీ ప్రవాహం వలె గంభీరంగా ప్రవర్తిస్తే, అల్పులు మురుగుకాల్వ మాదిరి దురాలోచనతో దుందుడుకుగా ప్రవర్తిస్తారని భావం. అల్పత్వమంటే ఉచితానుచితజ్ఞత లేకపోవడమే. అలాంటివారి ప్రవర్తన గొప్పగా ఉండే అవకాశం ఎక్కడినుంచి వస్తుంది.

**నిండు నదులు పాఱు నిలిచి గంభీరమై**
**వెఱ్ఱివాగు పాఱు వేగబోరలి**
**అల్పుడాడురీతి నధికుండు నాడునా?**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అధికుడు అనగా వివేకవంతుడు. పెద్దరికము గలవాడని భావము. అల్పునికి నోటి తొందర, దురుసు ఎక్కువగా ఉంటాయి. వివేకవంతుడు వెనుక ముందు చూచి, ఆలోచించి మాట్లాడుతాడు. అందుకే వేమన అల్పుడు ఆడంబరముగా మాట్లాడితే సజ్జనుడు నెమ్మదిగా మాట్లాడతాడని చెప్తూ ఆ ఇరువురిని కంచుతోను, కనకంతోనూ పోల్చాడు.

అంతేకాదు వంశంలో ఒక్క మంచి వాడున్నా వానివల్ల ఆ కులానికి, వంశానికి

పేరుప్రతిష్ఠలు ఇనుమడిస్తాయి. అడవిలో ఒక్క మంచి గంధపు చెట్టు ఉంటే దాని వాసన అడవి అంతటా వ్యాపిస్తుంది. ఆ చెట్టువంటివాడే ఉత్తముడైన వ్యక్తికూడ. కుటుంబానికి, సమాజానికి కూడ ఆదర్శప్రాయుడై మార్గదర్శకుడై చరిత్ర సృష్టిస్తాడు. మన ఇతిహాసాలు, చరిత్ర తిరగవేస్తే ఇలాంటి వారెందరో ఉన్నారు.

కాని చెడ్డవాడి వల్ల వచ్చే ప్రమాదాలు లెక్కలేనన్ని ఉంటాయి. తనతోపాటు మంచివారిని దారిమరల్చి తన దారికి తెచ్చుకోగలడు. ఎటువంటి వారినైనా కష్టాలపాలు చేయగలడు.

**హీనగుణమువాని నిలుసేరనిచ్చిన**
**నెంతవానికైన నిడుమ గల్గు**
**ఈగ కడుపు జొచ్చి యిట్టట్టు సేయదా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

కడుపులోనికి పొరపాటుగా ఈగ ప్రవేశిస్తే ఎంతగా కుదిపివేసి ఇబ్బంది పెడుతుందో, అంతటి ఇబ్బందిని ఇంటిలోనికి చేరిన నీచుడు కూడ కల్గిస్తాడు.

**వేరు పురుగు చేరి వృక్షంబు జెఱచు**
**చీడ పురుగు చేరి చెట్టు జెఱచు**
**గుత్సితుండు చేరి గుణవంతు జెఱచురా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

చెట్టును నాశనం చేసే పురుగులాంటివాడు గుణహీనుడు. మంచివారిని కూడ చెడగొడతాడు. అంతేకాదు అటువంటి నీచులతో కలిసి తిరగడం వలన మంచివారిని కూడ నీచులుగానే పరిగణిస్తారు. తాటిచెట్టు క్రింద నిలబడి పాలు త్రాగినా కల్లు అనే అనుకుంటారు. కాబట్టి దుష్టులకు దూరంగా ఉండటం చాల అవసరం.

సాధారణంగా చెడ్డవారే చుట్టూ చేరి వేరొక చెడ్డవాడికి నాయకత్వం ఇస్తారు. కారణం ఒకేరకమైన స్వభావం కల్గి ఉండటమే.

కఠినమైన మనస్సుగలవానిని కూడ సాధుచిత్తుడుగా మార్చటం అసాధ్యం, మూర్ఖులంతా కఠినులే.

**పరగ ఱాతిగుండు బగుల గొట్టగవచ్చు**
**గొండలన్ని పిండి గొట్టవచ్చు**

**కఠినచిత్తు మనసు కరిగింపరాదు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

**వంపుకఱ్ఱగాల్చి వంపు దీర్చగవచ్చు**
**గొండలన్ని పిండి గొట్టవచ్చు**
**గఠినచిత్తు మనసు కరిగింపరాదు**

– అని వేమన ఈ విషయం సాధ్యం కాదని తేల్చేశాడు. కాని ఈ లోకంలో మంచివారి కంటె చెడ్డవారే ఎక్కువగా ఉన్నారని వేమన అభిప్రాయం.

**మంచివారు లేరు మహిమీద వెదకిన**
**కష్టులెందరైన గలరు భువిని**
**పసిడిలేదుగాని పదడెంత లేదయా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

భూమిమీద బంగారం తక్కువ, బూడిద ఎక్కువగా ఉంది. అట్లే మంచి వారిని వెదకి చూచినా కనబడరు, అంటే స్వల్పసంఖ్యాకులన్నమాట. అదే మూర్ఖులైతే కొదవలేదు. ఎక్కడ చూచినా వారే అని వేమన చివరగా స్పష్టం చేశాడు.

మరి ఇంతటి ఇబ్బందికరమైన వారిని మార్చి మంచివారుగా చేయవచ్చును గదా అన్పించవచ్చు. విద్యావంతులను చేసి విచక్షణాజ్ఞానం పెంపొందించవచ్చునుగదా అన్పించవచ్చు. ప్రయత్నించటం ధర్మం కూడా.

"యత్నేసిద్ధ్యతినహికోత్ర దోషః" అనిగదా ఆర్యోక్తి. ఆశపడటం తప్పుకాదు. కాని గుణహీనులను, మూర్ఖులను మార్చుటం సాధ్యమయ్యే పనికాదు. అందుకే వేమన ఇలా చెప్తున్నాడు. "అల్పుడెన్ని విద్యలభ్యసించినగాని – ఘనుడుగాడు హీనజనుడె కాని" ఇది చివరిగా సమాధానం.

**ఎద్దుకైనా గాని యేడాది తెలిపిన**
**మాట తెలిసి నడచు మర్మమెఱిగి**
**మొప్పె తెలియలేదు ముప్పదేండ్లకునైన**
**విశ్వదాభిరామ వినురవేమ.**

నోరులేని, బుద్ధిజీవి కాని పశువు కూడ ఒక సంవత్సరం పాటు శిక్షణ ఇస్తే యజమాని భావాన్ని అర్థం చేసుకుని నడుస్తుంది. కాని మూర్ఖుడికి ముప్పైఏళ్ళు శిక్షణ ఇచ్చినా ప్రయోజనం శూన్యం.

"చేరి మూర్ఖుల మనసు రంజింపరాదు" అనే ఏనుగులక్ష్మణకవి పద్యపాదం అందరెరిగినదే.

కొయ్యబొమ్మను తెచ్చి కొడితే మాటరాదు. ఎలుక తోలు తెచ్చి ఉతికినా తెల్లగా రాదు. మొండివాడు కూడ అంతే. ఎంత చెప్పినా మారదు అని వేమన ప్రగాఢ విశ్వాసం. వేపచెట్టుకు పాలుపోసి పెంచితే తీపిగా మారదు. దుర్మార్గుడు మంచి మాటలతో, ఉపదేశాలతో మారడు. అది వాడి వల్లకాదు.



# వేమన సామాజిక దృక్పథం.5

**అడుగకర్థమిచ్చునతడు బ్రహ్మజ్ఞాని**
**అడుగనర్థమిచ్చునతడు త్యాగి**
**అడుగనీయలేని యతడు పెనులోభి**
**విశ్వదాభిరామ వినురవేమ.**

వేమన దానములకు అధిక ప్రాధాన్యమిచ్చిన విషయం అనేక పద్యాలలో ఉట్టంకించబడింది. అందులోను అన్నదానానికే వేమన ప్రథమ స్థానమిచ్చాడు. ఇతరులకు సహాయపడటమనేది ఎవరి అభ్యర్థనతో నిమిత్తం లేకుండా చేయగల మనస్తత్వం జ్ఞానులకు మాత్రమే సొంతమని వేమన అభిప్రాయం. అడిగినవాడికి ద్రవ్యం ఇచ్చేవాడు త్యాగం చేసినవాడౌతాడని, అడిగినా ఇవ్వలేనివాడు (ఇవ్వాలన్న బుద్ధి పుట్టనివాడు) లోభి అన్నది వేమన లోభులకు ఇచ్చిన నిర్వచనం.

**మొదట నాశపెట్టి తుదిలేదు పొమ్మను**
**పరమలోభులైన పాపులకును**
**ఉసురు తప్పకంటునుండేలుదెబ్బగా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఇస్తామని ఎదుటివారికి ఆశ కల్గించి చివరకు ఎగనామం పెట్టే లోభివాళ్ళకు, ఆశపడి అంగలార్చినవారి మనోవ్యథ తాలూకు ఉసురు సూటిగా, గట్టిగా తగులుతుందట. అంటే లోభులపట్ల వేమనకు తీవ్ర నిరసన భావం ఉంది.

లోభివారిని ద్రవ్యమర్థించడము పెద్ద తప్పు. ఆశకొద్దీ వారిని కదిలించి అడియాసల పాలవ్వడం కంటె దూరంగా ఉండటమే ఉత్తమం. అనవసరమైన ప్రయాస, ఆయాసం తప్ప ప్రయోజనం శూన్యం. ఇదే విషయాన్ని వేమన కొంచెం హాస్యస్ఫోరకమైన ఉదాహరణతో క్రింది పద్యంలో చెప్పాడు.

**గొడ్డుటావు బితుక గుండగొంపోయిన**
**బండ్లురాలదన్ను బాలనీదు**
**లోభివాని నడుగ లాభంబు లేదయా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఎండిపోయిన ఆవుదగ్గరకు పాలు పిండాలన్న ఆశతో వెళితే పళ్ళూడి పడేలా అది తన్నుతుంది. లోభివాడి దగ్గరకు పోయినవాడి పరిస్థితి కూడ అట్టిదే. బాధే ఫలితంగా మిగులుతుంది. ఇక్కడ లోభివాడిని పాలివ్వని ఆవుతో పోల్చి చెప్పడం ప్రత్యేకత.

**దాతకానివాని దరచుగా వేడిన**
**వాడు దాతయౌనే వసుధలోన**
**అవురుదర్భయౌనె యబ్ధిలోముంచిన**
**విశ్వదాభిరామ వినురవేమ.**

దాన స్వభావం గాని, లోభత్వముగాని సహజముగానే వస్తాయి. పదేపదే అడిగినా లోభి లేదా పిసినారివాడు దాతగా మారడు. మారలేడు. పిచ్చిగడ్డిని తీసుకునిపోయి సముద్రంలో ముంచినా అది రెల్లుగడ్డిపరకగా మారదు. చూడటానికి ఒకేరకంగా ఉన్నప్పటికి దేని ప్రత్యేకత దానిదే. దేని విలువ దానిదే. దర్భకున్న పవిత్రత గడ్డిపరకకు రాదు. దాతయొక్క లక్షణం లోభికి రాదు. అనగా మనస్తత్వాలు మార్చటం గాని మారటం గాని అంత తేలికగాదని వేమన తన లోకానుభవం, నిశిత పరిశీలనల ఆధారంగా తేల్చి చెప్పాడు.

ఏదేమైనా ఎవరికీ ఉపయోగపడని వ్యక్తులు పుట్టినా, చచ్చినా ఒక్కటే. చెదలు పురుగులు పుట్టలో పుడతాయి. చస్తాయి. అందువలన ఎవరికి గాని సంతోషము, సుఖము ఉండవు. అసలు వాటి గురించి ఎవరూ పట్టించుకోరు. అటువంటివారి జన్మ లెక్కకు తప్ప మరెందుకూ పనికిరాదు. ఒక్కమాటలో చెప్పాలంటే అలాంటి వాళ్ళు పుట్టడమే అనవసరమన్న తీవ్ర నిరసన ఈ పద్యంలో కన్పిస్తుంది. అంతేకాదు. ఎంతో కొంత దానస్వభావమున్న వ్యక్తి దగ్గర పిసినారివాడు చేరితే దాతను కూడా చెడగొడతాడు. ఎవరికి ఏమీ ఇవ్వకుండా చేస్తాడు.

**ఇచ్చువానియొద్దనీనివాడుండిన**
**జచ్చుగాని ఈవి సాగనీడు**
**కల్పతరువుక్రింద గచ్చపొదయున్నట్లు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

కోరికలు నెరవేర్చే శక్తిగల కల్పవృక్షము మొదట్లో గచ్చ(కాయ) చెట్ల పొద ఉంటే, దాని తాలూకు ముళ్ళ కారణంగా అర్థిజనం దాని దగ్గరకు చేరలేరు. చేరినా

ముళ్ళు గుచ్చుకోవడం మినహా ప్రయోజనం నాస్తి. ప్రక్కనే పిసినారివాడున్నప్పుడు దాత దగ్గరకు వెళ్ళినవాడికి కూడ అదే పరిస్థితి ఎదురౌతుంది.

ఒక వ్యక్తి, ఇంకొక వ్యక్తిని ఏరకంగా చెడగొట్టగలడనే విషయం వేమనకు అనుభవవేద్యమైన విషయం కావచ్చును. ఈవిధంగా వేమన లోభులు, పిసినారుల పట్ల నిరసన వ్యక్తం చేశాడు. అతని దృష్టిలో తోటివారికి సాయపడటం కనీస మానవ ధర్మం. అందుకే ఈవిధమైన స్పందన. ప్రజాకవికుండవలసిన ముఖ్యలక్షణం ఇలాంటి స్పందనయే కదా.

“మదినిదన్నుకొనక, తనది కాదనుకొని తాబెట్టునదే పెట్టు” అని దానలక్షణాన్ని కూడ వేమన చెప్పాడు. నిర్మలమైన మనసుతో, ప్రతిఫలాపేక్ష లేకుండ దానము చేయాలని సూచన.

అంతేగాని కూడబెట్టి కూడబెట్టి, తాను తినక ఇతరులకు పెట్టక చివరికి ఎవరో ఒకరికి కట్టబెట్టడం సరికాదు. తేనెటీగ పూలపై తిరిగి తేనెను సేకరించి తుట్టెలో చేరిస్తే, చివరికది ఏ బాటసారికో సొంతమౌతుంది. పిసినారివాడి సొమ్ము కూడ అంతే.

**ధనము కూడబెట్టి దానంబు చేయక**
**తానుదినక లెస్సదాచుకొనగ**
**తేనెటీగ కూర్చి తెరువరికియ్యదా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఈ పరిస్థితి సమర్థనీయం కాదు.

**మేక కుతికబట్టి మెడచన్ను కుడువగా**
**ఆకలేల మాను నాశగాక**
**లోభివానినడుగ లాభంబు లేదయా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అజాగళస్తనమునుండి పాలురావు. ఎంత ప్రయత్నించినా ఆకలి తీరదు. ఆశ మిగులుతుంది. లోభివాడి నడిగినా అంతే. లాభముండదు. అనగా లోభివాడి నుండి ఆశించడం అనవసరం అని దూరంగా ఉండటమే ఉత్తమం అని వేమన వ్యక్తం చేస్తున్నాడు.

ఒక దుష్టుడు మరొక దుర్మార్గుణ్ణి మెచ్చుకుంటాడు. ఒక జ్ఞానహీనుడు ఇంకొక

లోభిని గొప్పగా పొగుడుతాడు. దాతను దూషిస్తాడు. సమాన భావజాలము కలిగి ఉండుటయే దీనికి కారణముగాని, ఇందు యేమాత్రము సత్యము ఉండదు. పందికి బురదనీరు నచ్చుతుందిగాని పన్నీరు నచ్చదు. దాని స్వభావానికది సహజం.

**ఓగునోగు మెచ్చు నొనరంగనజ్ఞాని**
**భావమిచ్చి మెచ్చు బరమలుబ్ధు**
**బంది బురదమెచ్చు బన్నీరు మెచ్చునా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అనాథలకు దైన్యము బాపి ఆదుకునేవాడే మహనీయుడు. అతడే ఇహపరములందు గుర్తింపు, సుఖము పొందగలడని వేమన తీర్పు. కాబట్టి లోభిగా ఉండక సహాయకారులు కమ్మని సందేశం ఇచ్చాడు.

**దిక్కులేనివారి దీనత బాపిన**
**పురుషుడిహము నందె పూజ్యుడగును**
**పరమునందు వాని భాగ్యమేమనవచ్చు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అనే పద్యంద్వారా వేమన పై సందేశం అందించాడు.



# వేమన సామాజిక దృక్పథం. 6

"ధనమూలమ్ ఇదం జగత్" అనే అనుభవపూర్వకమైన ఆర్యోక్తి అందరెరిగినదే. జీవనాధారమమైన ఆ ధనమే మనిషిని తనకు బానిసగా చేసుకుంటున్న పరిస్థితులు రాను రాను అధికమౌతున్నాయి. డబ్బువెంట మనిషి పరుగులెత్తే ధోరణి పతాకస్థాయికి చేరుకుంటున్నది. ఇటువంటి స్థితిలో స్థాయీ భేదాలుండవచ్చునేమో గాని, గతంలోని మానవులు కూడ డబ్బుకు దాసోహమన్న ఘటనలెన్నో ఉన్నాయి. అందునా "నడమంత్రపు సిరి" ని గూర్చి నానుడులెన్నో ఉన్నాయి. ఇటువంటి పరిస్థితుల్ని కొంతవరకు గమనించిన వేమన ఈ విషయానికి తన శతక పద్యాలలో స్థానమిచ్చాడు.

**అల్పుడైన వాని కధిక భాగ్యము కల్గ**
**దొడ్డవారి దిట్టి తోలగొట్టు**
**అల్పజాతి మొప్పెయధికుల నెరుగునా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

సొమ్ము మంచివారికి లభిస్తే సద్వినియోగపడుతుంది. నీచులకు సిరులు పెరిగితే సజ్జనుల పాలిట శరాఘాతంలా మారుతుంది. ధనవంతుడైన నీచుడు ధనమదంతో మంచివారి నందరిని దూషించి, ఇక్కట్లపాలు చేసి వెళ్ళగొడతాడు. ఎంత సొమ్ము ఉన్నా మూర్ఖులకు గొప్పవారి లక్షణం, మర్యాద, సాంప్రదాయం తెలియవు కదా. దీనిని బట్టి వేమన సొమ్మువల్ల కలిగే అహంకారపు పరిణామాలను అనుభవపూర్వకంగా గుర్తించి పద్యస్థం చేశాడేమో ననిపిస్తుంది.

డబ్బున్నవాడి చుట్టూ వందిమాగధుల్లా తిరిగే అవకాశవాదుల పాత్ర అధికమై ఎలాంటి వాడికైనా డబ్బున్నప్పుడు ఉన్నత స్థానమే దొరుకుతుంది. కులగోత్రాల పేరుతో ఎక్కువ తక్కువలు ఆపాదించుకుంటున్న వారంతా డబ్బుచాటున కులాన్ని దాచేసి గొప్పవాడుగానే భావిస్తారు. డబ్బులేనప్పుడు కులమేదైనా స్థానం తగ్గుతుంది. ఇది లోకంలో అనేక సందర్భాలలో నాడూ నేడూ కూడ ఎదురయ్యే పరిణామమే. కలిమిని పొందినప్పుడు అంతరాలు పక్కకు తొలగుతాయి. అదేవిషయం వేమన క్రింది పద్యంలో ఇలా చెప్పాడు.

**కులము లేనివాడు కలిమిచే వెలయును**
**గలిమి లేనివాడు కులము దిగును**
**కులముకన్న భువిని కలిమి యెక్కువ సుమీ!**
**విశ్వదాభిరామ వినురవేమ.**

కాని ఎంతటివాడైనా కొన్నిసార్లు చతికిలబడక తప్పదు. "ఓడలు బండ్లవుతాయి, బండ్లు ఓడలవుతాయి" అనేది ఒక తెలుగు సామెత. కాలగతిలో పైస్థాయి నుండి క్రిందికి, క్రిందిస్థాయి నుండి పైకి మానవుని జీవన గమనం స్థానం మారుతూ ఉండటం అనివార్యం.

అదే విషయాన్ని వేమన "కలిమి లేమి రెండు గల వెంతవారికి" అంటూ స్పష్టం చేశాడు. ఏదేమైనా డబ్బుయొక్క అవసరం వేమన విస్మరించలేదు. కులగోత్రాలకు, విద్యావైదుష్యాలకు మించి లోకులు డబ్బుకిచ్చే ప్రాధాన్యాన్ని క్రింది పద్యంలో వేమన చెప్పిన తీరు డబ్బుకు దాసులైన వారికొక తీవ్రమైన చురక.

**కులముగలుగువాడు గోత్రంబు గలవాడు**
**విద్యచేత విఱ్ఱవీగువాడు**
**పసిడి గలుగువాని బాసిన కొడుకులు!**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఆభిజాత్యము గలవాడు, విద్యావంతుడు కూడ ధనవంతునికి సేవకుల వలె మారిపోతారట. అంతేకాదు. ధనవంతునికి చిన్న అనారోగ్యం కలిగినా భూమిపైన ఒక పెద్ద వార్తగా ప్రచారమౌతుంది. కాని పేదవాడి యింట్లో పెళ్ళి జరిగినా ఎవరూ పట్టించుకోరు. ఈ ఆదరణ, నిరాదరణలకు కారణం ధనం ఉండటం, లేకపోవటము మాత్రమే సామాన్య జీవన విధానంలో డబ్బు గలవానికున్న గౌరవం, స్థానం అట్లాంటివి మరి.

**విత్తము గలవాని వీపున పుండైనా**
**వసుధలోనజాల వార్తకెక్కు**
**పేదవాని యింట పెండ్లైన నెరుగరు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఈ పద్యంలోని భావం వేమన మనసు పొరలను తాకి పేదవారి పట్ల

జాలిని కల్గించిన పద్యంగా కన్పిస్తున్నది. ఇటువంటిదే మరొక పద్యం.

**కనియుగానలేడు కదలుపదానోరు**
**వినియు వినగలేడు విస్మయముగ**
**సంపద గలవాని సన్నిపాతంబిది**
**విశ్వదాభిరామ వినురవేమ.**

డబ్బు ఎక్కువైనవాడికి కనిపించేదీ, వినిపించేదీ సరిగా అర్థంకాకపోవడమనే ఒక పెద్ద జబ్బు వస్తుంది. ఇది అనారోగ్యంతో కాదు. అహంకారంతో వచ్చే జబ్బు. డబ్బు నలుగురికి ఉపయోగపడాలేకాని అహంకారాన్ని, గర్వాన్ని పెంచకూడదు.

ఆ అహంకారంతో అబద్ధాలాడితే సిరి దూరమౌతుందనే అభిప్రాయంతోపాటు, అప్పులు చేయకూడదని, అప్పులేనివాడే అదృష్టవంతుడని గొప్ప సందేశం ఇచ్చాడు వేమన.

**ఉప్పులేనికూడ యొప్పదు రుచులకు**
**పప్పులేని తిండి ఫలము లేదు**
**అప్పులేనివాడె యధిక సంపన్నుడు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఉప్పులేకుండా వండిన కూరకు రుచిరాదు. పప్పులేని తిండి బలాన్నివ్వదు. ఇటువంటి భోజనం తిన్నా ఫలితం సున్న. ఎన్ని సంపదలున్నా అప్పులు చేసినవాడికి మనశ్శాంతి, గౌరవము లోపిస్తాయి. అందుకని వేమన దృష్టిలో అప్పులేనివాడే గొప్పవాడు ఇటువంటిదే మరొక పద్యము.

**అప్పులేనివాడే యధిక సంపన్నుడు**
**తప్పులేనివారు ధరణిలేరు**
**గొప్పలేని బుద్ధి కొంచెమైపోవురా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అప్పుచేయడం పెద్ద తప్పు. దానివల్ల గొప్పతనం నశించి గౌరవం తగ్గిపోతుందని భావం. అసలు అప్పు చేయడమనేది ఆ హరిహరాదులకు కూడ తగదట.

**అప్పుదీయ రోత హరిహరాదులకైన**
**మొప్పెతోటి పొందు మొదలెరోత**
**తుప్పుబలిసియున్న తూటు మహారోత**
**విశ్వదాభిరామ వినురవేమ.**

మొప్పె అనగా మూర్ఖుడు. తూటు అంటే చిల్లు అని అర్థము. మనిషిని ఇంతగా వశం చేసుకోగల్గిన ఆ సిరి ఓటికుండలోని నీరు కారిపోయినట్లు అదేపనిగా అబద్ధాలాడేవారి చేతినుండి జారిపోతుందట. తస్మాత్ జాగ్రత్త!



# వేమన సామాజిక దృక్పథం.7

**దేవపూజ చేయ దివ్య భోగము గల్గు**
**తత్త్వమెరిగెనేని దైవమగును**
**ఏ మెరుంగని నరుడు యేగతిజెందునో**
**విశ్వదాభిరామ వినురవేమ.**

జ్ఞాని, ఆత్మజ్ఞానిగా తన స్థానాన్ని పెంపొందించుకునే ముందు అవలంబించే కర్మయోగములలో పూజాదికములను, యజ్ఞయాగాదులను కూడ చెప్పవచ్చును. అటువంటి స్థితిలో శ్రద్ధాళురై పూజాదికములను నిర్వహించు భక్తులకు ఆనందరూపమైన, కర్మబంధ విముక్తరూపమైన భోగము లభిస్తుంది. కాని ఆయా పూజాదికములు ఎవరిని ఉద్దేశించి చేస్తున్నామో ఆ భగవంతుని తత్త్వాన్ని గుర్తించినపుడు, అనగా ఆత్మజ్ఞాన సంపన్నుడైనపుడు ఆ మానవుడే దైవముగా మారగలడు. "న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే" అని గీతావచనము. ఇచట జ్ఞానమనగా శాస్త్రజ్ఞానమా? లోకజ్ఞానమా? ఆత్మజ్ఞానమా? అని చర్చకు వచ్చుట సహజము. కాని ఈ జ్ఞానములన్నియు ఒకదాని కొకటి తోడై ఆత్మజ్ఞాన సముపార్జనకు దారి తీయగలవనునది నిర్వివాదాంశము.

**"తపస్విభ్యోఽధికోయోగీ, జ్ఞానిభ్యోఽపిమతోఽధికః ।**
**కర్మభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీభవార్జున ॥**

తపస్సుకంటె, కర్మలకంటె, జ్ఞానముకంటె యోగము గొప్పదని శ్లోకసారాంశము. యోగిగా మారడానికి మిగిలినవన్ని దోహదములే. ఆ స్థాయికి చేరినప్పుడే తత్త్వజ్ఞానం కలుగుతుంది. కాని కర్మమార్గముగాని జ్ఞానమార్గముగాని మరే యితర విచక్షణ, విచారములుగాని లేని మానవులను గూర్చి ఇంచుకంత జాలితో వారే గతిని పొందుతారోనని వేమన పలుకుతున్నాడు. అనగా ఈ విధమైన స్థితిని ఆక్షేపణగా, అనపేక్షణీయంగా వేమన భావిస్తున్నాడు.

వేమన తమ ఆత్మలోనున్న దైవమును గుర్తించలేని సామాన్యులు తీర్థయాత్రలకు తిరుగుతారని, తర్కవాదములకు దిగుతారని, బహుశాస్త్రములు

చదువుతారని. రాతి ప్రతిమలకు పూజలు చేస్తారని, ఇంకా అనేక మార్గాలు అవలంబిస్తారని ఆయా పద్యాలలో చెప్తూ, అన్నింటి కంటె ఉత్తమమైనదిగా "మనసు నిల్పడాన్ని" పరిష్కారంగా చూపాడు. సద్గురువునాశ్రయించి తత్త్వమును తెలిసికొన్నప్పుడే ఆత్మజ్ఞానం పొందగలరని వ్యక్తం చేశాడు. శరీరం నీటికుండ వంటిదైతే గురువు చిల్లగింజ వంటివాడని చెప్పి, చిల్లగింజ నీటిని శుభ్రపరచినట్లే గురుశశ్రూష, బోధలద్వారా ఈ శరీరాంతర్గతమైన ఆత్మను అంటియున్న కల్మషం తొలగిపోతుందని స్పష్టం చేశాడు. అంతేకాదు. పునర్జన్మ సిద్ధాంతమును పూర్తిగా నమ్మిన, హైందవధర్మంలో పుట్టి పెరిగిన వేమన గతజన్మల తాలూకు పాపపుణ్యాల ప్రభావాన్ని తన పద్యాలలో ప్రస్తావించాడు.

**పూర్వజన్మమందు పుణ్యంబు సేయని**
**పాపకర్ముదాశపడెడి ధనము**
**వెదబెట్టక కాయవెదకిన చందమౌ**
**విశ్వదాభిరామ వినురవేమ.**

విత్తనము నాటకుండ మొక్కరాదు. మొక్క వృక్షమై కాయలు, పండ్లు ఇస్తుంది. కాని ఆ విత్తనమే నాటకుండ కాయలు ఆశించడం, వెదకులాడటం వృథాప్రయాస. అదేవిధంగా గతజన్మలో సత్కర్మ లాచరించని మనిషి వర్తమానంలో ధనాన్ని ఆశించడం వృథా. ఇక్కడ ధనమంటే కేవలం డబ్బుకాదు. ఐహికాముష్మికమైన సత్ఫలితం అని చెప్పుకోవాలి. సంచిత కర్మలు జన్మ జన్మాలకు వెంటాడతాయని ఒక నమ్మకం. కావున జననాంతరములకు చెందిన వాసనారూపమైన గుణగణాలు, కర్మఫలాలు సాధకుడికి అనుకూల ప్రతికూలతలు కల్గిస్తాయని సారాంశం. కాబట్టి ఆత్మతత్త్వజ్ఞాన సముపార్జనకై ప్రతి జన్మలోను ఎంతో కొంత సాధన చేయాలని ఫలితాంశం. ఇటువంటి సాధనకు మార్గం 'ఒక్క మనసుతోడ ఊరకున్న సర్వసిద్ధుడగును, సర్వంబు తానౌను" అంటూ, ఏకాగ్రత నిశ్చలతత్త్వాలు సోపానాలుగా వేమన సూచించాడు. చివరగా వేమన చెప్పిన సిద్ధాంతాన్ని అనుసరించి తనలోనే ఉన్న ఆత్మలో దైవమున్నాడని సుస్పష్టం.

"తనదు యాత్మలోన దైవంబు నెరుగక" అని వేమన పద్యపాదం. ఆ దైవం వెలుగులోని వెలుగు, పలుకులోని పలుకు అని, లోచూపుతో చూస్తే తెలుస్తుందని వేమన అభిభాషణ. గీతాంతర్గత భావమే వేమన అభిప్రాయంగా కన్పిస్తున్నది.

**"అహమాత్మాగుడాకేశ! సర్వభూతాశయస్థితః ।**
**అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ ॥**

సర్వభూతస్థితమైన ఆత్మజ్ఞానమే పరమాత్మజ్ఞానంగా వేమన అభిప్రాయం. "మూలకారణం బెవ్వడు, అనాది, మధ్య, లయుడెవ్వడు. సర్వము తానైన వాడెవ్వడు, వాని నాత్మభవునీశ్వరునే శరణంబు వేడెదనన్న" భాగవత పద్యంలోని సిద్ధాంతం కూడ ఇదే. అటువంటి శాశ్వతమైన పరబ్రహ్మను, పరమాత్మను గూర్చి తెలుసుకోవడం, అంతర్ముఖులై ప్రయత్నించడం, తననుగురించి, తనలోని ఆత్మను గురించి తెలుసుకోవడమే వేమనకు నచ్చిన ఆధ్యాత్మిక విధానాలుగా నిర్ధారించవచ్చు. ఇదే విషయం క్రింది పద్యంలో గుర్తించవచ్చు.

**చెవినిల్లుగట్టి చెప్పెను వేమన**
**బట్టబయలు పరబ్రహ్మమనుచు**
**బుద్ధిగల్గువారు పొంది సుఖింపుడీ**
**విశ్వదాభిరామ వినురవేమ.**

'పరబ్రహ్మ బట్టబయలు' అని చెప్పడానికి కారణం దైవం మనకు తెలియని ఏ చోటనో లేదు, దైవాన్ని గూర్చి తెలిసికొనడం అత్యంత గహనమైన రహస్యమూ కాదు అని స్పష్టం చేయడానికే, భగవంతుడు మనలోనే ఉన్నాడు అన్నది సారాంశం. తెలివైనవారు ఈ విషయాన్ని గ్రహించి జ్ఞానానందరూపమైన సుఖం పొందవలెనని వేమన ఆకాంక్షకూడ ఇక్కడ సుస్పష్టం.



# వేమన సామాజిక దృక్పథం.8

**మనస్తత్వ విధానాలు :**

**ఉప్పుకప్పురంబు ఒక్కపోలికనుండు**
**జూడజూడరుచుల జాడవేరు**
**పురుషులందు పుణ్యపురుషులు వేరయా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

చూడటానికి ఒకేవిధంగా కన్పించినప్పటికి ఆయా పదార్థముల లక్షణము, రుచి, ఉపయోగము భిన్నముగా ఉంటాయి. ఉదాహరణకు ఉప్పు, కర్పూరము చూసేందుకు తెల్లగానే ఉన్నావాటి రుచి, లక్షణం పూర్తి భిన్నంగా ఉంటాయి. అదేవిధంగా శరీర నిర్మాణ పరంగా మనుషులంతా ఒకేరకంగా ఉంటారు. కాని ఆలోచనలు, తెలివితేటలు, మంచితనం, జ్ఞానం మొదలైన విషయాలలో ఎవరికి వారు వేర్వేరుగానే ఉంటారు. కాబట్టి మానవులలో గొప్పవారు, పుణ్యాత్ములైన వారి పద్ధతి మిగిలిన వారి కంటే భిన్నమే. ఇది గుర్తించి మసలు కోవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఆ అవసరాన్ని ఈ పద్యం తెలియచేస్తూ భిన్న మనస్తత్వాల గురించి సూచిస్తున్నది.

**అల్పుడెపుడు పల్కు నాడంబరము గాను**
**సజ్జనుండు బల్కు జల్లగాను**
**కంచుమ్రోగునట్లు కనకంబు మ్రోగునా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

మనుషులు వారి వారి స్వభావములను బట్టి మాట్లాడుటలో తేడాలుంటాయి. ఉపయోగించే పదాలు, పారుష్య సారళ్యాలు, ఆడంబరాలు, హడావుడి అన్నీకూడ వారి వారి స్వభావాన్ని ఎదుటివారికి కొంతమేరకు పట్టిచూపుతాయి. ఒక మనిషికి వేరొక మనిషికి మధ్య మంచి మాట సాన్నిహిత్యాన్ని పెంచితే, కువిమర్శలు, దూషణలు దూరాన్ని పెంచుతాయి.

మానవుల సంభాషణవైఖరిని క్షుణ్ణంగా పరిశీలించిన వేమన సంక్షిప్తంగా వారి వాగ్వైఖరిని, మనస్తత్వాన్ని ఇలా చెప్పాడు. నీచుడు ఎప్పుడూ ఆడంబరాలు చెప్తూ ఉంటాడు. సద్గుణ సంపన్నుడు ఎటువంటి గొప్పలకు పోకుండా సౌమ్యంగా మాట్లాడతాడు. విలువైన బంగారం క్రింద పడితే చిన్న శబ్దం వస్తుంది. తక్కువ విలువ

గల కంచు అనే లోహం క్రింద పడితే పెద్ద శబ్దం వస్తుంది. సజ్జనదుర్జనుల విధానం కూడా ఇంతే.

**గంగపారునెపుడు గదలని గతితోడ**
**మురికి వాగు పారు మ్రోతతోడ**
**పెద్దపిన్నతనము పేర్మియీలాగురా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అతిపెద్దది, పవిత్రమైనది యైన గంగానది కదలకుండా ప్రశాంతంగా ప్రవహిస్తుంది. మురికినీటి వాగు మాత్రం ముందుకు ఉరుకుతూ వేగంగా పెద్ద శబ్దం చేస్తూ ప్రవహిస్తుంది. పెద్దరికం ఉన్నవారి, లేనివారి ప్రవర్తనల మధ్య కూడా ఇలాంటి అంతరమే కన్పిస్తుంది.

కాబట్టి మాటతీరు, నడక, నడత, ప్రవర్తనా వైఖరి సునిశితంగా పరిశీలించి ఇతరులతో సంబంధాలు పెంపొందించుకోవాలి.

**కోపమునను ఘనత కొంచెమై పోవును**
**కోపమునను మిగుల గోడు గల్గు**
**కోపమడచెనేని కోరికలీడేరు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

కోపము అనేది మానవస్వభావమునకున్న సహజలక్షణములలో ఒకటి. కాని దాని స్థాయి అధికమైనప్పుడు శారీరకముగా, వ్యక్తిగతముగా, సామాజికముగా ఎన్నో సమస్యలను చవిచూడక తప్పదు. అపజయాలను ఆహ్వానించినట్లే అవుతుంది. ఆలోచనలు ఆవేశపూరితంగాను, ఉద్వేగభరితంగాను ఉన్నప్పుడు కోపమనేది తీవ్రస్థాయికి చేరుతుంది. సందర్భాన్ని బట్టి వీలైనంత మేరకు దీనిని అదుపు చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. అలా కానప్పుడు గౌరవమర్యాదలు లోపిస్తాయి. ఇబ్బందులు ఎదురౌతాయి. కోరికలు నెరవేరవు. కాబట్టి దానిని తగ్గించుకొని తీరాలి. భగవద్గీతలో చెప్పిన

**"అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।**
**స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥"**

అనే శ్లోకం మంచి మాటకు వాఙ్మయతపస్సుగా గొప్పస్థానాన్ని గౌరవాన్ని ఇచ్చింది. మానవులు ఉద్వేగములకు లోనుకాని విధంగా సత్యము ప్రియము, హితముయైన విధంగా మాట్లాడటం మంచిదని పరోక్ష సందేశంగా భావించి ప్రయత్నించటం

అవసరం. రకరకాల నైపుణ్యాల పేరుతో ఆధునిక కాలంలో మౌఖిక పరీక్షలు మొదలైన వాటికి ఇచ్చే శిక్షణ ఇటువంటి అంశాలు ప్రాతిపదికలుగానే మొదలౌతున్నది. **"తనకోపమె తనశత్రువు"** అనే సత్యాన్ని గ్రహించాలి.

**శాంతమె జనులను జయము నొందించును**
**శాంతముననె గురుని జాడ తెలియు**
**శాంత భావ మహిమ జర్చింపలేమయా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

'తనశాంతమె తనకు రక్ష' అనే మాట అందరికీ తెలిసిందే. కాని దానిని అనుభవ స్థాయికి తీసుకుని రావడమే మిగుల కష్టసాధ్యం. ప్రశాంతచిత్తుడైన వ్యక్తి ఆరోగ్యాన్ని ఆనందాన్ని పొంది ఇహలోకంలో సుఖించటంతో పాటు మంచి గురువును వెదకి పట్టుకుని, సాధన చేసి సంసారబంధ విముక్తుడౌతాడు. శాంతం యొక్క మహిమను గూర్చి చర్చించటం, వివరించటం సాధ్యం కాదని వేమన అభిభాషణ. అంటే శాంత స్వభావానికున్న శక్తి అంత ఎక్కువ. చాలా గొప్పది అని అర్థం.

అంటే మానవుడు ఆవేశాన్ని, ఉద్వేగాన్ని, అందుకు కారణమైన ఇంద్రియ లౌల్యాన్ని అదుపులో పెట్టుకుని, ప్రశాంత చిత్తుడై జీవించి తన లక్ష్యం సాధించి 'తానేమిటి, తానెవరు, తనలో ఉన్నదెవరు' అనే వేదాంత విషయాలకు చివరగా సమాధానం తెలుసుకోవాలని వేమన కోరిక. గీతాకారుని వచనములననుసరించి కోపము, మోహము మొదలైన అవలక్షణములు పెంపొందినప్పుడు శాంతమనేది కనుచూపు మేరలో ఉండదు.

**"క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।**
**స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥"**

అందువల్ల ప్రశాంతచిత్తతకు తొలిమెట్టు కోపాన్ని జయించటం, తద్వారా స్వీయవినాశన మార్గాన్ని దూరం చేసుకోవడం ముందుగా చేయవలసిన పని.

**"విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః ।**
**నిర్మమో నిరహంకారస్సశాన్తిమధిగచ్ఛతి ॥**

ఆపై కోరికలను విడనాడి, నిరహంకారుడైనప్పుడే మానవుడు శాంతస్థితిని సాధించగలడు. ఈ విధంగా పై పద్యం లౌకిక, అలౌకికములైన వ్యక్తిత్వ, మనస్తత్వాలు ఎలా ఉండాలో తెలియచేస్తున్నది.



# IV
# వేమన - జీవితం - విశేషాలు

ఇన్నివిధాలుగా జన సామాన్యానికి అత్యంత సరళమైన రీతిలో లౌకికబోధతో పాటు పారలౌకిక జ్ఞానాన్ని అందించిన వేమన తాను చెప్పిన పద్యాన్ని బట్టి కొండవీటిలో నివసించినట్లు స్పష్టమౌతున్నది. అసలు 'మూగచింతపల్లె' అని, నివాసము 'కొండవీడు' నందని క్రింది పద్యము ద్వారా సుస్పష్టము.

**"ఊరు కొండవీడు, ఉనికి పశ్చిమవీథి**
**మూగచింతపల్లె మొదటివీడు**
**అరశి చూడ బయలు ఆడనే శివుడుండు**
**విశ్వదాభిరామ వినురవేమ.**

కొండవీటియందు పడమర వీధి నివాస స్థలమని, మొదటి ఊరు మూగచింతపల్లె అని చెప్పటంతోపాటు వేమన తాను నమ్మిన తత్త్వసిద్ధాంతాన్ని కూడ ఈ పద్యంలో చెప్పాడు.

ఆలోచించి చూస్తే తనతోపాటే (తనలోనే) శివుడున్నాడని మూడవ పాద భావం. 'శివోఽహం' అనే విషయమే వేమన ఇక్కడ చెప్పిన విషయంగా కన్పిస్తున్నది. రెడ్డిరాజులు కొండవీటిని 1424వ సం॥ వరకు పాలించి నట్లుగా చరిత్ర సాక్ష్యం ఉన్నది. చివరి రాజుకు సోదరుడైన వేమన 15వ శతాబ్దంవాడే కావాలి. కాని వేమన 1650వ సంవత్సరంలో జన్మించినట్లు అధికులు ఆమోదించారు. ఈ విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. కడపజిల్లాలో జన్మించినట్లుగాను, బాల్యంలో ఇతని పేరు కుమారగిరి వేమారెడ్డిగాను చారిత్రకుల నిర్ణయం. మానవ జీవితంలోని అన్ని కోణాలను స్పృశించి కర్తవ్యబోధ చేసిన గొప్ప దార్శనికుడు వేమనయోగి. మానవతావాదిగా యథార్థవాదిగా, సార్వజనీనము, సార్వకాలికమైన ఉపదేశాన్ని, సందేశాన్ని తెలుగువారందరికీ తన పద్యాల ద్వారా అందించిన వేమన నిత్యస్మరణీయుడు. ఆదర్శాల కన్నా ఆచరణకే ప్రాధాన్యం ఇచ్చిన క్రియావాది వేమన. సమాజ ప్రవృత్తిని ఒకవైపు పేర్కొంటూనే, మానవసేవే మాధవసేవ అనే ఆలోచన కల్గించే విధంగా కర్తవ్యబోధ చేశాడు. ఆత్మ, పరమాత్మ వేర్వేరు కాదనే అద్వైత సిద్ధాంత ధోరణి ఆధారంగా ఆత్మజ్ఞానం

పొందే మార్గం గురించి వివరించి మోక్షమార్గాన్ని సులభతరంగా చెప్పాడు. చిత్తశుద్ధికి, నిరాడంబరతకు ప్రాధాన్యాన్నిచ్చిన గొప్ప అధ్యాత్మ విద్యాసంపన్నుడు వేమన. ఇతడు కొండవీటి పాలకులైన రెడ్డిరాజులలో చివరివాడైన రాచవేమారెడ్డి సోదరుడు. బాల్యంలో అల్లరిచిల్లరగా తిరిగి యౌవనంలో వేశ్యాలోలుడై చివరకు పశ్చాత్తాపం పొంది గురువులను ఆశ్రయించి ఉపదేశం పొంది, జ్ఞానియై, యోగియై, శతకకర్తయై అనేక ప్రాంతాల్లో పర్యటించినట్లు తెలుస్తున్నది. ఏమైనప్పటికిని ఇంటింటా తన పద్యాలతో మానవీయ విలువలను వెదజల్లిన వేమనకవి ధన్యుడు. పాఠకులలో ఆలోచనాశక్తిని పుట్టించిన వేమన పద్యాలు తెలుగువారు గర్వంగా చెప్పుకోదగిన సాహితీ సంపద. కాని ఆ పద్యాలలోని లోతైన భావాన్ని గ్రహించ గల్గినప్పుడే ఆ సంపదకు సరైన ప్రయోజనం కలుగుతుంది. లేదంటే వేమన చెప్పినట్లు వ్యర్థం కాక తప్పదు. ఎన్ని చదువులు చదివినా ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవడమే చరమలక్ష్యంగా వేమన ఆదేశం, సందేశం కూడ.

**చదివి చదివి కొంత చదువంగ చదువంగ**
**చదువు చదివి యింకజదువుచదివి**
**చదువు మర్మములను చదువలేడయ్యెను**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఎన్ని చదువులు చదివినా, ఎంతకాలం చదివినా ఆ చదువులోని అంతరార్థం (ఆత్మతత్త్వం) తెలుసుకోలేకపోతే ఆ చదువు వృథా అవుతుంది. అలా కాకుండ వేమన శతకం చదివిన వారంతా ఎంతో కొంత వేమన ఆశించిన రీతిగా తత్త్వజ్ఞానం, లోకజ్ఞానం పొంది ఆ రచనలను సార్థకం చేయాలని మా ఆకాంక్ష.

